

ಉಭಯ ಭಾಷಾಕವಿ ಮಿತ್ರರಾದ ಶ್ರೀ ಶಿವಕವಿ ಎನ್. ಶಿವಗೌಡರವರ
"ನಾಡಕವಿ ವೇಮಣ್ಣ" ಕನ್ನಡ ಅನುವಾದ ಪದ್ಯಕಾವ್ಯ ಆವಿಷ್ಕರಣ ಸಂದರ್ಭದಲ್ಲಿ
ಕೃತಿಕರ್ತರಾದ ಶ್ರೀ ಶಿವಕವಿ ಶಿವಗೌಡರವರಿಗೆ ಸ್ವರ್ಣಾಭಿಷೇಕವು ಶ್ರೀಮಾನ್
ದತ್ತಾತ್ರೇಯಗೌಡರು ಅವರ ಸಹಸ ದಿಂದ ನಡೆಯಿಸಿದ ದೃಶ್ಯ. ದಿನಾಂಕ 14 11 98

# సర్వజ్ఞ త్రిశతి

## పద్యకావ్యము
## ఆంధ్రానువాదము



కృతికర్త

**శివకవి N. శివగౌడు**

ఆదోని - 518 301

సర్వజ్ఞ త్రిశతి

శివకవి N. శివగౌడుగారు





ప్రథమ ముద్రణము : 1999

పుటలు : 126

ప్రతులు : 1000






ప్రకాశకులు:
C. మరేగౌడు, B.A.,LL.B.
డెప్యూటి లా శెక్రెటరి (రిటైర్డు) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
No. 17, ఫస్టు బ్లాకు, ఫస్టు మైన్, 80 ఫీట్ రోడ్డు,
నాగరభావి 2 స్టేజి, బెంగళూరు - 560 072
ఫోన్ : 3480911

*Printed at :*
**Aatreya Process Pvt. Ltd.,**
Bangalore-44.
Tel/Fax : 338 1428, 338 5216
email: aatreya@vsnl.com
website: www.aatreya.com



ఈ కావ్యము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము
వారి ఆర్థిక సహాయముతో ముద్రిత మైనది

ఓం

మాతృదేవోభవ　　　　　　　　　　పితృదేవోభవ

కృతి కర్త
తల్లి దండ్రులు



**N.A.** లింగమ్మ, చిప్పగిరి　　**N.P.** వీరనగౌడు Ex. V.M.

స్వామి యతియునైన సర్వజ్ఞ త్రిపదుల
ఆంధ్రభాషయందు ననువదింప
జన్మదాతలైన జననీజనకులను
సాంద్రభక్తితోడ సన్నుతింతు

# అవతారిక

ఈ పవిత్ర భారతావనిని విశ్వమానవ శ్రేయమునకై ప్రభవించిన "సర్వజ్ఞుడు" ప్రాతఃస్మరణీయుడు. ఆ మహాకవి సంఘ విద్రోహ శక్తుల నిర్మూలనకై తన ఆశుకవితను కరవాలముగా ఝళిపించిన క్రాంతి కారుడు. కన్నడ రాష్ట్రమున సంఘ ప్రేమియు, సంఘజీవియు, సంఘ సంస్కర్తయునై ప్రజా జీవన రుగ్మతను రూపుమాపగ నవతరించిన భిషగ్వరుడు. త్రిపది కవి చక్రవర్తిగా కన్నడ భాష యున్నంతవరకును వెలుగునిచ్చు జ్యోతిగా ఆబాలగోపాలముచే కైమోడ్పులందుకొను మహోన్నతకవి సర్వజ్ఞ సుకవి.

ఈ మహాకవి త్రిపదుల చివర సర్వజ్ఞయను మకుటమే ప్రజల నోట మెదలి వీరికి సర్వజ్ఞ నామధేయము స్థిరమై కన్నడ భూమిని సురుచిర కీర్తిని గడించినది. వీరి నిజమైన పేరు కాని, కాలము కాని, కులగోత్రాదికములు కాని, నేటికిని విజ్ఞులకంతుబట్టలేదు. వీరి త్రిపదులనాధారముగా చేసికొని పలువురు పరిశోధకులు ప్రకటించిన అభిప్రాయములే కాని ఇతరాధారములేవియు నేటివరకు లభ్యము కాలేదు.

ఈ త్రిపది కవి చక్రవర్తి కర్ణాటక రాజుల పాలనము అంతరింప నీతి నియమ ప్రవర్తనములు ప్రజలు విడనాడి విచ్చల విడిగా మెలగుచు, స్వచ్ఛ జీవనస్రవంతిని కలుషితము చేయుకాలమున ఉదయించెను. సంఘ శ్రేయస్సునకై విప్లవవీరుడై కలమునుబట్టి సంఘ దురాచారముల ఖండించుచు ఉత్తమ మార్గముల నెత్తిచూపెను. తన రచనలలో ఎడనెడ వినమ్రతతో

"సర్వజ్ఞనెంబువను గర్వదిందాదవనే
సర్వరోళ్ ఒందొందు నుడిగలితు విద్యదా
పర్వతవెయాద సర్వజ్ఞ ...."

యని నిగర్వియై తనవినయశీలమును ప్రకటించుకొనెను. తనకు సర్వజ్ఞనామము. తాను ప్రజల మధ్య నివసించి ప్రజలయందొక్క

టొక్కటిగ పలుకులేరి సేకరించి స్వానుభవమున విద్యల పర్వతమైనానే కాని నాకు నేనై గర్వముతో సర్వజ్ఞుడని చెప్పుకోలేదన్నాడు

ఈతడుదయించిన గ్రామము ధారవాడ జిల్లా, మాసూరు గ్రామమనియు, బసవరస, కుంబార మాళికి జనించిన వాడనియు కర్ణా కర్ణిగా జనులాడుకొను దంతకథలవల్ల తెలియుచున్నది. ఇతని కాలము 15 వ, శతాబ్దము ఉత్తరార్ధమనియు, 16 వ శతాబ్దము పూర్వార్ధమనియు కొందరు చరిత్రకారులవాదన. కవికాలమేదైనను, దేశమేదైనను, జాతిమతములేవైనను సార్వకాలిక సాహిత్య మందించిన కవి పుంగవుడు పూజార్హుడే సుమా.

సర్వజ్ఞుడు ప్రజల శాసించు ప్రజాకవి. ఈ మహాకవి ప్రజా జీవన సంస్కృతి సారమును స్వానుభవముతో మేళవించి త్రిపది సుధలో రంగరించి మధుర కూజితస్వనముతో పాడిన గానకోకిల యనుట నిశ్చ ప్రచము. వీరి రచనలలోని నుడికారమున సులలిత పదజాలము వీరి త్రిపదులను వెదకికొనుచు అప్రయత్నముగ వచ్చి చేరినట్లుతోచును. ఈతని కవితలో నిర్భీతి, నిర్దాక్షిణ్యత, సత్యపాలన, ధర్మనిష్ఠలు జీవములై వెల్లివిరియుచుండును. తెలుగునాట ఆరాధ్యుడైన ప్రజాకవి యోగివేమన వలె కన్నడిగులకు ఈ కవిశేఖరుడు ఆరాధ్య పరివ్రాజకా చార్యుడు.

ఈ సుకవి త్రిపదులు కర్ణాట మహీతలమునందలి మారు మూలల నివసించు పల్లెపట్టులలోని పామరులుకూడా హాయిగా కమ్మగా పాడు కొనుట కలవాటు పడిరన్న వీరి పలుకుల బాటలు జుంటితేనియ తియ్యని తేటలు, కర్ణాట వాణి, గళసీమనలంకరించిన ఆణిముత్యాల సరులనుట సహజోక్తియే యగును.

ఈ పురుషోత్తముని కన్న "కన్నడ తల్లి" చల్లని తల్లి ఉగ్గుతో పెట్టిన మధురమనోజ్ఞ భావ పరంపరలకు కాణాచియని కైమోడ్చుట మనకర్తవ్యము.

సర్వజ్ఞుని త్రిపదులలో భావావేశమును సదుద్దేశమును ఎత్తి చూపుటయే నా ధ్యేయము. ఈ రచనలలో ప్రతిబింబించు సర్వ మత సామరస్యము, అపారమైననీతి, వితరణతర్కము వ్యంగ్యము,

అనిర్వచనీయ జనరంజనశక్తి నిండి తొణికిసలాడుచున్నదనుటలో సందేహములేదు. సర్వమత సామరస్యమునకు ఈ క్రింది పద్యము ఉదాహరణ.

" ಊರೆಲ್ಲ ನೆಂಟರು ಕೇರಿಯಲ್ಲವು ಬಳಗ
ಧಾರುಣಿಯು ಎಲ್ಲ ಕುಲದೈವವಾಗಿರಲು
ಯಾರನ್ನು ಬಿಡಲೊ ಸರ್ವಜ್ಞ"

విశాల హృదయులు సదయులైన ఉదారచరితులు ఈ ధరాతలమంతయూ ఒకే కుటుంబముగానే తలంతురు. వీరి త్రిపదుల మణుల మాగాణమున పద్యరాసులను 33 పద్ధతులుగా విభజించి 2100 త్రిపదులను శ్రీ ఉత్తంగి చెన్నప్ప గారు గ్రంథస్థము గావించిరి. వీరి తరువాత శ్రీ మరియప్ప గారు 1020 త్రిపదులను 12 పద్ధతులలో క్రోడీకరించి తమ గ్రంథమును వెలువరించిరి.

ఇట్లు వెలువడిన మరికొన్నింటిని పరిశీలించి నాకు తోచిన విధముగా సర్వజ్ఞుని కన్నడ త్రిపదులను "సర్వజ్ఞ త్రిశతి" యను పేరున ఆంధ్రీకరించితిని. తేటతేట తేటగీతికలతో రచన త్రిపదుల పద్ధతిలో మూడు పాదములలో కవి భావమును ఇమిడ్చి "త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర" యను మకుటముతో నాల్గవ పాదము స్వీకరించి గ్రంథము సొంతము కొనసాగించితిని.

ఇంతకు ముందు వెలువడిన గ్రంథము "నాడకవి వేమణ్ణ" అనునది. అందు వేమన ఆటవెలదులను కన్నడభాషలో ఆటవెలదులుగానే అనువదించితిని. వేమన పద్యముల రసమాధుర్యము కన్నడిగులకు చూపుటయు, కన్నడ సర్వజ్ఞుని త్రిపదుల సుమసౌరభమును తెలుగువారికి అందించుటయు ఈ నా చిన్ని ప్రయత్నము యొక్క పరమలక్ష్యము. అసిధారావ్రతతుల్యమగు ఈ అనువాద కృషికి సహృదయ చదువరులే ప్రమాణము.

ఇట్లు,
సుధీజన విధేయుడు

**శివకవి N. శివగౌడు**

అంటే శివగౌడుగారి తేటగీతులు కూడా త్రిపదుల కిందేలెక్క "నామూలం లిఖ్యతే కిఞ్చిత్ నానపేక్షిత ముచ్యతే" - అని (శ్రీ మల్లినాథసూరి చెప్పినట్లుగా), గౌడుగారు తమ అనువాదంలో మూలంలో సర్వజ్ఞుడు చెప్పిన దేదీ వదలలేదు అనవసరమైనదేదీ తాను చేర్చలేదు. కన్నడంలో కవిత అల్లగలిగిన నేర్పరి కాబట్టి మూలాన్ని చక్కగా అర్థం చేసి కొని తెలుగులో సంక్షిప్తంగా సూటిగా అనువాదంచేశారు. వేమన ఆటవెలదుల వలెనే కన్నడంలో సర్వజ్ఞుని వచనాలు సామాన్య ప్రజల నాలుకలపై నిరంతరం నాట్యంచేస్తూ ఉంటాయి. అటువంటి జనప్రియమైన త్రిపదుల్ని సుందరంగా అనువదించిన తీరుకు కొన్ని ఈదిగువ ఉదాహరణలిస్తున్నాను.

పద్ధతి

| | | |
|---|---|---|
| భక్తి<br>(కన్నడ) | చిత్తవిల్లదె గుడియ సుత్తిదడె ఫలవేను<br>ఎత్తు గాణవను హొత్తు తానిత్యదీ<br>సుత్తి బందంతె సర్వజ్ఞ | |
| భక్తి<br>(తెలుగు) | ఇలను గుడిచుట్టు దిరుగంగఫలము గలదె?<br>చిత్తశుద్ధియు లేకున్న శివమదేడ?<br>గాను గెద్దును తిరుగదే కాడిమోసి | (33) |
| జ్ఞానము<br>(కన్నడ) | నాటరాగవు లేసు, తోటమల్లిగె లేసు,<br>కూటవదు లేసు హిరియరోళ్, శివన<br>అరిదాటవే లేసు సర్వజ్ఞ | |
| జ్ఞానము<br>(తెలుగు) | నాటరాగము లెస్స! పూదోట మల్లె<br>లెస్స! సాధు సంగమ మది లెస్స! శివుని<br>తత్త్వ సారంబెరుంగుటే ధరణి లెస్స! | (45) |
| దానము<br>(కన్నడ) | అన్నవను ఇక్కువదు నన్నియను నుడియువదు<br>తన్నంతె పరర బగెవుడె కైలాస<br>బిన్నాణవక్కు సర్వజ్ఞ | |

| | | |
|---|---|---|
| దానము | అన్నమిడువారు సత్యము నాడువారు | |
| (తెలుగు) | తనవలెనె ఎల్లవారిని గనెడువారు | |
| | చేరుచుందురు కైలాస శిఖర వనికి | (57) |
| | | |
| విధిలీల | కర్మదిందలె హరను చర్మవను తానుట్ట | |
| (కన్నడ) | హెమ్మరాళవు అజనాద గోవింద | |
| | నెమ్మెయను కాద సర్వజ్ఞ | |
| | | |
| విధిలీల | చర్మమునుగట్టెశంభుడు కర్మచేత | |
| (తెలుగు) | అజుడు చక్రాంగ పక్షిగా నవతరించె | |
| | పద్మనాభుడు పసులకాపరియునయ్యె | (99) |
| | | |
| సత్యము | 1. బత్తి ఎణ్ణెగళెరడు హొత్తి బెళగువ రీతి | |
| నీతి | సత్య నీతిగళెరడు బెళగిదవు జోడగలె | |
| (కన్నడ) | కత్తలీ జగవు సర్వజ్ఞ | |
| | | |
| సత్యము | వత్తినూనెల జంటతో వచ్చు వెలుగు | |
| నీతి | నీతి సత్యాల జంటచే నెగడు వెలుగు | |
| (తెలుగు) | జంటవిడిపోవ తిమిరమ్ము జగతిగ్రమ్ము | (128) |
| | | |
| (కన్నడ) | 2. జాజియ హూలేసు, తేజి వాహన లేసు | |
| | రాజమందిరదొళిరలేసు తప్పుగళ | |
| | మాజువదె లేసు సర్వజ్ఞ | |
| | | |
| (తెలుగు) | జాజి పూలెస్స! పయనించవాజి లెస్స! | |
| | రాజమందిర వాసంబు రాణ లెస్స! | |
| | తప్పులెంచకనుండుట తగిన లెస్స! | (173) |
| | | |
| సంసార | బెచ్చనెయ మనెయాగి వెచ్చక్కె హొన్నాగి | |
| సుఖము | ఇచ్ఛెయను అరివ సతియాగి స్వర్గక్కె | |
| (కన్నడ) | కిచ్చు హచ్చెంద సర్వజ్ఞ | |

సంసార వెచ్చదనమిచ్చు భవనంబు, వెచ్చమునకు
సుఖము వచ్చు సిరి, వశవర్తిని భార్యగలుగ
(తెలుగు) స్వర్గమేటికి కాల్పనా జనుల కరయ (2

లోకనీతి 1. ఉరగన హాలునంజు సురిగెయ మొనెనంజు
(కన్నడ) కరుణ విల్లదన నుడినంజు దుర్జనర
ఇరవెల్ల నంజు సర్వజ్ఞ

లోకనీతి త్రాచుకోర విషము! ఖడ్గధార విషము!
(తెలుగు) ఎన్న నిర్దయు నుడికార మెల్ల విషము!
ధూర్తుడగువాని ఇరవెల్ల దోగు విషము! (2

(కన్నడ) 2. ఎళ్ళు గాణిగ బల్ల, సుళ్ళు సింపిగ బల్ల
కళ్ళరను బల్ల తళవార, బణజిగను
ఎల్లవను బల్ల సర్వజ్ఞ

(తెలుగు) తిలల నెరుగును గానుగ ద్రిప్పువాడు!
తలవరెరుగును చోరుల, దర్జివాడు
నన్నృత మెరుగును! వర్తకుండఖిల మెరుగు! (2

పొడుపు కడె బిళుదు నడుగప్పు ఉడువ వస్త్రవదల్ల
కథలు బిడదె నీరుంటు మడువల్ల కవిగళే
(కన్నడ) బెడగ పేళువుదు సర్వజ్ఞ (కణ్ణు)

పొడుపు నిండు తెలుపుండు నడుమన నుండునలుపు
కథలు వలువయా కాదు, జలముండు కొలనుగాదు
(తెలుగు) విజ్ఞలగువార లీముడి విప్ప దగును (కన్ను) (2

సర్వజ్ఞుని కన్నడ త్రిపదులలోని, లయాత్మకత తేటగీతుల
కొన్నిచోట్ల కొంత లోపించినా శివగౌడుగారి అనువా
తేటతెనుగులో నల్లేరుమీద బండిలా హాయిగానడిచింది.
ఉత్తంగి చెన్నప్పగారి 33 పద్ధతుల నుండి స్వీకరించిన, ఇ
పద్ధతులు కొంచెము మార్పుతో ఈరకంగావున్నవి.

గురు మహిమ, దైవము, భక్తి, జ్ఞానము, దానము, లోభము, ౦లము, విధి లీల, మాట, బీదరికము, సత్యము-నీతి, వ్యవసాయము, యూర్ఖుడు స్త్రీ, విషమ దాంపత్యము, సంసార సుఖము, అన్న ౦హిమ, లోక నీతి, పొడుపు కథలు, శకునములు ఈ పద్ధతులలో అంతర్విభాగాలలో) సత్యము-నీతి లోక నీతి, అనే విభాగాలు ౦ద్దవి, (మొదటి దానిలో 54 పద్యాలు, రెండవదానిలో 56 ౦ద్యాలుఉన్నవి) తక్కినవన్నీ చిన్నవిభాగలే, ఒక్కొక్కదానిలో 12 ౦ద్యాలుకన్నా ఎక్కువ లేవు. కొన్నివిభాగాలు మరీ చిన్నవిగా ఉన్నాయి. వ్యవసాయము, మూర్ఖుడు, విషమ దాంపత్యము, సంసార ౦ఖము, అనే విభాగాలలో ఆరేసి పద్యాలు మాత్రమే ఉన్నాయి. ౦వరనున్న శకునములు అనే విభాగములో రెండే రెండు పద్యాలు ఉన్నాయి. మూలంలో ఈ పద్ధతులలో చాలా పద్యాలు (త్రిపదులు) ఉన్నాయి. వాటిలో తనకునచ్చిన త్రిపదుల్ని మాత్రమే శివగౌడుగారు ౦్వకరించారు.

తెలుగువారి జనప్రియు వేమన్నను కన్నడిగులకు ౦రిచయంచేయడం, కన్నడిగుల జనప్రియ కవి సర్వజ్ఞని తెలుగువారికి ౦రిచయం చేయడం, అనే ఈ మహత్తర కార్యాన్ని మొదట ౦ర్వహించిన మహానుభావుడు కీ.శే. కలుగోడు అశ్వత్థరావుగారు. మళ్ళి అటువంటి బృహత్కార్యాన్ని తన కవితాశక్తితో మిక్కిలి ౦మర్థవంతంగా నిర్వహించిన వ్యక్తి 'శివకవి' శ్రీ ఎన్. శివగౌడుగారు. ఆంధ్ర కర్ణాట సాహిత్య రంగాలలో అశ్వత్థరావుగారి కీర్తిలాగే శివగౌడుగారి కీర్తి కూడ చిరస్థాయిగా ఉండిపోతుందనడంలో ఎట్టి ౦ందేహము లేదు.

'సౌరభ"
బెంగుళూరు

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

సమయోచితముగ తన రచనలలో దుయ్యబట్టినట్లు కన్నట్టుచున్నది. ఇదియునుగాక జైనమతానుయాయుల జీవనపద్ధతిలోని మత సాంప్రదాయ దురాచారములకును వీరి రచనలలో నిరసన వ్యక్తమగు చున్నది. ఈ కవికి సంస్కృతభాషా పరిచయ గంధము లేనందున బ్రహ్మద్వేషము వీరికి ప్రబలియుండవచ్చునని, బ్రాహ్మణులు బహిష్కరించిరని కర్ణా కర్ణిగా కన్నడనాట వినవచ్చు చున్నది. ఈ అపవాదు సత్యదూరము. మహాత్ములకు లోకమే కుటుంబము. స్వ-పర పక్షపాతములేని విశ్వ కుటుంబికి ఈ అపవాదు నంటగట్టుట తగదు.

సర్వజ్ఞుని జాతి మానవజాతి, మతము దేవమతము, కాలము సర్వ (తద్ధర్మ) కాలము అనునీదృష్టితో, త్రిపదులను పరిశీలించు సహృదయులకు అందలి నైసర్గిక సౌందర్య మనోజ్ఞత, హృదయంగమ భావనా నైపుణ్యము, కన్నడ నానుడల భాషా చమత్కృతులు గోచరించును. ఇట్టి మహాకవికి తాను చక్కగా సూక్ష్మేక్షికతతో త్రిపదులను చదివి జీర్ణించుకొని హృదయ పీఠమున నిలిపికొని శ్రీ శివకవి యన్. శివగౌడుగారు తనమనస్సుకు నచ్చిన, సహృదయులు మెచ్చిన త్రిశతి (మున్నూరు) త్రిపదులను చక్కని తేట తెనుగున దేశి గీతికలతో తేట గీతులలో ఆంధ్రభాషా వధూటికి కైసేయ బూనుట యుక్తి యుక్తముగనున్నది. స్థాలీ పులకన్యాయమున ఈ ఉభయ కవుల రచనా ప్రాగల్భ్యమును మీ ముందుంచ బూనుట నా కర్తవ్యము. అది నా భాగ్యవశమున సంప్రాప్తించినదని తలచు చున్నాను.

ప్రకృత మనుసరామః

సర్వజ్ఞ కవి॥ నందియను ఏరిదన, చందిరన సూడిదన
కందనా బేడి నలిదాను నెనపుత్త
ముందె హేళువెను సర్వజ్ఞ...

అనిరంచించిన కృత్యాది త్రిపదిని

శివకవి॥ నందివాహంను విమల బాలేందుధరుని
సబల పుత్రుని గణనాథు సుసన్నుతించి
ఒప్పు త్రిపదుల మెప్పార చెప్పుదేను

అని మనోజ్ఞముగా మూడుపాదములలోనే తెనిగించి నాలుగవ పాదమును "త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర" అను మకుటముతో అలంకరించెను సర్వజ్ఞుల త్రిపదులను తానును తేటగీతి మూడుపాదములలోనే రసవత్తరముగ తెనిగించి తనకు సర్వజ్ఞకవి పైనున్న భక్తి గౌరవములను "త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర" అనునాలుగవ పాదమునందలి మకుటముతో ముగించి క్రొంగ్రొత్త సాంప్రదాయమునకు "మార్గదర్శీ మహర్షిః" అన్నట్లు స్వాగతించిన శివకవి శివగౌడు గారిని సాహితీలోకము ఎన్నటికిని మఱువజాలదు. ఇట్లీ గ్రంథమంతయు త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర అను మకుటము తోనే సర్వజ్ఞ మహాకవి కీర్తికి అద్దముపట్టుచున్నది.

గురుమహిమను వర్ణించుచు

సర్వజ్ఞ కవి॥ బంధుగళు ఆదవరు బందుండు హోగువరు
బంధనవ కళెయలరియరు గురువింద
బంధుగళు ఉంటె సర్వజ్ఞ ...

అని కన్నడకవి పలకిన ఆ త్రిపదిని

శివకవి॥ బంధువులు వచ్చి తినిపోవు వారెకాని
బంధనములను త్రెంచెడి వారు కారు
గురువు కంటెను బంధువుల్ ధరణి కలరె..

అని అలవోకగా తేటగీతిలో కన్నడము కస్తూరికి గుబాళింపును, సౌరభ పరివృష్టిని, మన తెలుగుకవి ఎట్లు సమకూర్చెనో చూచితిరిగదా! దైవమును వర్ణించుచు భగవంతుడొక్కడే అని చాటు త్రిపదిని చూడుడు.

సర్వజ్ఞ కవి॥ ఒబ్బనల్లదె జగకె ఇబ్బరుంటే మత్తె
ఒబ్బ సర్వజ్ఞ కర్తనీ జగకెల్ల
ఒబ్బనే దైవ సర్వజ్ఞ

శివకవి॥ ఒక్కడే కాని మరియిద్దరుండగలరె
సకల జగతికి సర్వజ్ఞుడొకడె కర్త
స్వామి పరమాత్మయొక్కడే సర్వమునకు

అని తెనుగించునపుడు. తెనుగుకవి, బుద్ధి నైశిత్యమునకు, మనోజ్ఞ భావనకు, ప్రతీకయనక తప్పదు.

సర్వజ్ఞ కవి॥ భక్తియెంబుదు బీజ ముక్తియెంబుదు ఫలవు
యుక్తియలి వృక్షవేరిదవగె ఇళెయల్లి
ముక్తి ఇహుదెంద సర్వజ్ఞ

శివకవి॥ భక్తియనునది బీజంబు ముక్తిఫలము
యుక్తిచే వృక్షమెక్కెడి యుత్తమునకు
పరమ పదభాగ్యమబ్బు నీ ధరణియందు

అనితెనిగించి మూలమునకు తెనుగు కవి మెఱుగులుదిద్దెననుట అతిశయోక్తి కానేరదు

సర్వజ్ఞ కవి॥ ఆనె కన్నడియల్లి తానడగి యిప్పంతె
జ్ఞానవుళ్ళవన హృదయదలి పరశివను
తా నడగిహను సర్వజ్ఞ

అను జ్ఞాన శీర్షికయందలి త్రిపదిని

శివకవి॥ హస్తియద్దమునందు తానడగునట్లు
జ్ఞాన మొదవిన హృదయాన తానడంగి
అలరు చుండును భవరోగ హరుడు భవుడు

అని తెనిగించి ఈ శివకవి భవరోగహరుడు భవుడు అనిమూలమునకు వన్నె తెచ్చుచు మూలమున నున్న పరమశివుని

సర్వజ్ఞ కవి ॥ ఆగబా, ఈగబా హోగిబా ఎన్నదలె
ఆగలే కరెదు కొడువవర ధర్మ హో-
-న్నాగదే బిడదు సర్వజ్ఞ

అను దానము శీర్షికకు చెందిన త్రిపదిని మంచినీళ్ళు త్రాగునట్లు అతితేలికగా

శివకవి ॥ రేపురా మాపురా మళ్ళిరాపొయనక
అప్పుడే పిల్చి యిచ్చెడి అతులమతుల
భాగ్యమేమందు బంగారు పంట కాదె

అని తెనిగించిన శివకవి నుడి కారపు సొబగును చూచి మెచ్చని రసజ్ఞుడుండునా సుంత యోచింపుడు. ఇక లోభము అను శీర్షికకు చెందిన త్రిపది.

సర్వజ్ఞ కవి ॥ కళ్ళరిగె సుళ్ళరిగె డొళ్ళరిగె డొంబరిగె
సుళ్ళు గొరవరిగె కొడువవరు ధర్మక్కె
ఎళ్ళష్టు కొడరు సర్వజ్ఞ

అని ఉన్నమూలమునకు తెనుగు కవి పద్యమిది

శివకవి ॥ దొంగ దబ్బరి డొల్లరి దొమ్మరులకు
కల్ల గొరవయ్యలకు నిత్తు రుల్లమలర
ధర్మ మడిగిన నూగింజ దాటనీరు

మూడవ పాదములోని నూగింజ నువ్వుల గింజకు వ్యావహారికము కాబోలును. కులమును ప్రస్తావించుచు మూలమున నున్న నీ త్రిపదిని చూడుడు

సర్వజ్ఞకవి ॥ ఉత్తమద వర్ణిగళె ఉత్తమరు ఎనబేడ
మత్తె తన్నంతె బగెవరెల్లరను
ఉత్తమరు ఎన్ను సర్వజ్ఞ

తెనుగు సేతను గమనింపుడు.

తెనుగు ||　　ధనమున ఉత్తము కులమున ఉత్తములు కారు
పరుని తనవలె నెంచెడి కరుణ హృదయు
లైన వారినే ఉత్తము లనగవలయు

రెండవ పాదమున పరుని తనవలె భావించు అనుటకు బదులు పరుని తనవలె నెంచెడి (తలచెడి) అని అలతి అలతి తెలుగు పదములతో చెప్పుట కవికి తెనుగు నుడికారముపై నున్న ప్రీతిని తెలుపుట లేదా?

ఇట్లే "విధిలీల", "మాట", "బీదరికము", "సత్యము-నీతి", "వ్యవసాయము", "మూర్ఖుడు", "స్త్రీ", "విషమ దాంపత్యము", "సంసార సుఖము", "అన్నమహిమ", "లోకనీతి", "పొడుపు కథలు", మున్నగు శీర్షికల లోని త్రిపదులను హృదయంగమముగ శివకవి యన్. శివగౌడుగారు తెనిగించిరి. శ్రీ శివగౌడుగారు భాషలో నట నట తెనుగు వారికి అపరిచితములును, కర్ణాటకాంధ్ర ఉభయ భాషా కోవిదులకు మాత్రమే పలుకుబడిలో నిలిచియున్నవియును, నగు పదములు కన్పట్టును. వ్యాకరణ శాస్త్రమునకు లొంగని కొన్ని ప్రయోగములును గోచరించును. "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః" అనునట్లు గుణపక్షపాతులకును, సహృదయులకును రసభంగమును కలిగింపవు.

నాకు ఈ ఉభయ భాషా కవితోడి పరిచయము. ఈ కవిని నాకై యున్న అభిమానము ఈ రెండు మాటలను మీ ముందుంచుటకు తోడ్పడినది. గ్రంథము మీ ముందున్నది. ఆలసింపక రసజ్ఞులు ఉభయ భాషా స్వారస్య మాధుర్యములను అనుభవింతురుగాక

తెనుగు నుడి కారమున తీరు తెన్నులన్ని
కన్నడమ్మున కన్పట్టు వన్నెలకును
మైత్రి చేకూర్చి రసికుల మానసముల
పరవశింపగ "శివగౌడు" పలికె కృతిని

త్రిపది కవిచంద్రు సద్గుణజ్ఞ దేశికేంద్రు
హృదయ పీఠిని నిల్పి సహృదయు లెన్న
ఉభయ కవులను మెప్పించు సూక్తు లెన్నొ
కృతిని సుకృతియౌ శివగౌడు హితుడుగాదె!

ఈ కవి ఇతోధికముగ ఉభయ భాషా విద్వత్కవులను మెప్పించు రసవత్తరములగు కృతులకు జన్మభూమియై సరస్వతీ సమారాధనమున తన జన్మమును కృతార్థము జేసికొని ఆయురారోగ్య యశో విభవ భాగ్యశాలియై కల కాలము సాహితీసేవ చేయవలయునని ఆకాంక్షించుచున్నాను.

సమస్త సన్మంగళాని భవన్తు

ఇట్లు విన్నవించు
సమస్త విద్వజ్జన విధేయుడు
**విద్వాన్ టి. రామకోటీశ్వరరావు**
విశ్వనారాయణ కళాశాల, ఆదోని

# గణపతి స్తవము

తే॥ గీ॥ పద్మబాంధవు బింబమ్ము పాటలమ్ము
ఘనద మణిఫణి యొడ్డాణమున వెలుంగ
రాగ రంజిత పీతాంబరమును గట్టి
భద్రగజయానుడౌ గణపతిని గొలుతు. 1

ఆ॥ వె॥ తండ్రి మూడు కనుల తనమూడు కరముల
అల్లనల్ల మూసి యంబి కేశు
నాత్మమెచ్చ నాడు ఆ బాల కరిముఖు
సన్నుతింతు కావ్య సమ్ముఖమున 2

# శ్రీ శారదాస్తవము

ఆ॥ వె॥ అజుని రాణి వాణి నాత్మయందున నిల్పి
పలుకు పాటవమ్ము పరగనిచ్చి
కలము జాలువార పలుకులల్లన దీర్చ
సారభక్తి తోడ సన్నుతింతు. 3

ఆ॥ వె॥ తొలుత నలువనోట పులకింపగా బుట్టి
కులక బుట్టిన మునితిలకు నాల్క
తొలుత కాలియందె ఘలఘలా రవళుల
నాడిన వరవాణి నభినుతింతు. 4

# శ్రీ మహాయోగి లక్ష్మాంబికాస్తవము

తే॥ గీ॥ కన్నడమ్మున సర్వజ్ఞ కవితలైన
త్రిపదులను వ్రాయబూనితి తెనుగునందు
సఫలముగజేయ వరమిమ్ము సరసకవిత
దేవి లక్ష్మాంబ ఆదోని దేవతాంబ. 5

# ಪೀಠಿಕೆ

ತ್ರಿಪದಿ॥ [illegible] ಪರಿದವನ ಚಂದಿರನ ಸೂಡಿದನ
ಕಂದನಾ ಬೇಡಿ ಸಲಿದಾನು ಸೆನಪುತ್ತ
ಮುಂದೆ ಪೇಳುವೆನು ಸರ್ವಜ್ಞ ೧

ತ್ರಿಪದಿ॥ ಎಲ್ಲ ಬಲ್ಲವರಿಲ್ಲ ಬಲ್ಲವರು ಬಹಳಿಲ್ಲ
ಬಲ್ಲವರು ಇದ್ದು ಬಲವಿಲ್ಲ ಸಾಹಿತ್ಯ
ವೆಲ್ಲರಿಗಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೨

ತ್ರಿಪದಿ॥ ಸರ್ವಜ್ಞನೆಂಬುವನು ಓರ್ವನೇ ಜಗಕೆಲ್ಲ
ಸರ್ವಜ್ಞರೀರ್ವರಾಗಲ್ಕೆ ತನಗಾಗಿ
ಕರ್ಮವೆಸಗಿಹನೆ ಸರ್ವಜ್ಞ ೩

ತ್ರಿಪದಿ॥ ಸರ್ವಜ್ಞನೆಂಬುವನು ಗರ್ವದಿಂದಾದವನೆ?
ಸರ್ವರೋಳ್ ಒಂದೊಂದು ನುಡಿಗಲಿತು ವಿದ್ಯದಾ
ಪರ್ವತವೆ ಆದ ಸರ್ವಜ್ಞ ೪

ತ್ರಿಪದಿ॥ ಸರ್ವಜ್ಞನರಿದಿಹನು ಸರ್ವರಸ ಅರಿದಿಹನು
ಸರ್ವಜ್ಞನರಿಯದಿರುತಿಹನು ಉರ್ವಿಯೋಳ್
ಗರ್ವಿತಾನೆಂದ ಸರ್ವಜ್ಞ ೫

ತ್ರಿಪದಿ॥ ಹೇಳಲರಿಯನು ನಾನು ಹೇಳಿಸಲು ಹೇಳಿದೆನು
ಬಾಳ ಲೋಚನನ ಶರಣಾರ ಆಳಾಗಿ
ಹೇಳಿದೆನು ಕೇಳ ಸರ್ವಜ್ಞ ೬

# పీఠిక

తే॥ గీ॥ నందివాహను విమల బాలేందు ధరుని
సబల పుత్రుని గణనాథు సంస్తుతించి
ఒప్పు త్రిపదుల నొప్పార జెప్పుదేను
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 1

తే॥ గీ॥ సకల మెరిగిన ప్రాజ్ఞులు జగతి లేరు
ప్రాజ్ఞులేకొందరోయున్న ప్రాపులేదు
అరయ సాహిత్యమెల్లర కబ్బలేదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 2

తే॥ గీ॥ స్వామి సర్వజ్ఞ డొక్కడే జగతి కెల్ల
నుభయ సర్వజ్ఞులగుటచే నొప్పు మీర
తనకునై కర్మ సర్వజ్ఞ డెనయ నిచ్చె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 3

తే॥ గీ॥ ఘనుడు సర్వజ్ఞడయ్యెనా గర్వమునను
ప్రజల యందొక్కటొక్కటి పలుకు లేర్చి
వాసి గాంచెను విద్యల పర్వతముగ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 4

తే॥ గీ॥ అరయ సర్వజ్ఞ ధీజను డవని జనుల
నెల్లవారల నెరుగును ఏర్పడంగ
అతని నెరుగనివాడె గర్వాంధ జనుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 5

తే॥ గీ॥ చెప్పజాలను కవిత నే చెన్నుమీర
బేసికన్నయ్య దాసుల దాసుడగుచు
పలుకు[illegible] బల్కుచున్నా[illegible] పరవశించి
త్రిపది [illegible] సర్వజ్ఞ దేశికేంద్ర 6

# ಗುರುಮಹಿಮೆ

ತ್ರಿಪದಿ॥ ಜ್ಯೋತಿಯಿಂದಲಿ ನೇತ್ರ ರಾತ್ರಿಯೋಳ್ ಕಾಂಬಂತೆ
ಸೂತ್ರದಿಂ ಧಾತು ನರಿವಂತೆ ಶಿವನ ಗುರು
ನಾಥನಿಂದರಿಗು ಸರ್ವಜ್ಞ ೭

ತ್ರಿಪದಿ॥ ವಿದ್ಯಕಲಿತಡೆಯಿಲ್ಲ ಬುದ್ಧಿಕಲಿತಡೆಯಿಲ್ಲ
ಉದ್ಯೋಗ ಮಾಡಿದೊಡೆ ಇಲ್ಲ ಗುರುಮುಖವು
ಇದ್ದಲ್ಲದಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೮

ತ್ರಿಪದಿ॥ ಮಂಡೆಬೋಳಾದೊಡೆಂ ದಂಡಕೋಲ್ಪಿಡೆದೊಡೆಂ
ಹೆಂಡತಿಯ ಬಿಟ್ಟು ನಡೆದೊಡೆಂ ಗುರುಮುಖವ
ಕಂಡಲ್ಲದಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೯

ತ್ರಿಪದಿ॥ ಊರಿಂಗೆ ದಾರಿಯನು ಆರು ತೋರಿದರೇನು
ಸಾರಾಯದ ನಿಜವ ತೋರುವ ಗುರುವು – ತಾ
ನಾರಾದರೇನು ಸರ್ವಜ್ಞ ೧೦

ತ್ರಿಪದಿ॥ ಬಂಧುಗಳು ಆದವರು ಬಂದುಂಡು ಹೋಗುವರು
ಬಂಧನವ ಕಳೆಯಲರಿಯರು, ಗುರುವಿಂದ
ಬಂಧುಗಳು ಉಂಟೆ ಸರ್ವಜ್ಞ ೧೧

ತ್ರಿಪದಿ॥ ಹಿರಿಯ ನಾನೆನಬೇಡ ಗುರುವ ನಿಂದಿಸಬೇಡ
ಬರೆವವರ ಕೂಡ ಹಗೆಬೇಡ, ಬಂಗಾರ–
–ದೆರವು ತರಬೇಡ ಸರ್ವಜ್ಞ ೧೨

# గురు మహిమ

తే॥ గీ॥ జ్యోతిచే రేయి కన్నులు జూచుకరణి
సూత్రమున ధాతువరసెడి చొప్పు దోప
గురుని కృపతోడ నరయుమా పరమశివుని
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 7

తే॥ గీ॥ విద్యలను కడునేర్చి కోవిదుడునైన
ప్రాజ్ఞుడైనను ఉద్యోగ భరితుడైన
గురుని కృప లేక హీనంబె నరుని బ్రతుకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 8

తే॥ గీ॥ మగువ విడనాడి దండంబు మమతబట్టి
గుండు గీయించి తిరిగినా కోర్కె విడదు
గురుని కృపలేక హీనంబె నరుని బ్రతుకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 9

తే॥ గీ॥ ఊరు చేరగ బోవగా దారి జూపు
వార లెవ్వరైన నగుగాక, సార సత్య
తత్త్వ దేశికులెవ్వరైన తప్పుగాదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 10

తే॥ గీ॥ బంధువులు వచ్చి తినిపోవు వారెకాని
బంధనములను ద్రెంచెడి వారు కారు
గురువుకంటెను బంధువుల్ ధరణికలరె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 11

తే॥ గీ॥ గురుని నిందింపకుము నేను గొప్పనకుము
పొగరు అధికారితో పగబోక మనుము
అరువు అపరంజి దేకుము హానివచ్చు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర.

ತ್ರಿಪದಿ॥ ಎತ್ತಾಗಿ ತೊತ್ತಾಗಿ ಹಿತ್ತಲದ ಗಿಡನಾಗಿ
ಮತ್ತೆ ಪಾದದ ಕೆರನಾಗಿ ಗುರುವಿನ
ಹತ್ತಿರಿರು ಎಂದ ಸರ್ವಜ್ಞ ೧೩

ತ್ರಿಪದಿ॥ ಮೂರಿಟ್ಟರಾರಕ್ಕು ಆರುಹನ್ನೆರಡಕ್ಕು
ಹೇರುವ ಗೊಡ್ಡು ಹಯನಕ್ಕು ಗುರುಕರುಣ
ತೋರುವಾ ದಿನಕೆ ಸರ್ವಜ್ಞ ೧೪

ತ್ರಿಪದಿ॥ ಗುರುವಿಂದ ಬಂಧುಗಳು, ಗುರುವಿಂದ ದೈವಗಳು
ಗುರುವಿಂದಲಿಹುದು ಪುಣ್ಯವದು, ಜಗಕೆಲ್ಲ
ಗುರುವಿಂದ ಮುಕ್ತಿ ಸರ್ವಜ್ಞ ೧೫

ತ್ರಿಪದಿ॥ ಸುರತರುವು ಮರವಲ್ಲ ಸುರಭಿಯೊಂದಾವಲ್ಲ
ಪರುಷ ಪಾಷಾಣದೊಳಗಿಲ್ಲ ಗುರುರಾಯ
ನರರೊಳಗಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೬

ತ್ರಿಪದಿ॥ ಉರಿಯುಂಡ ಕರ್ಪೂರವು ಸರಕು ಮಾರುವಮುಂತೆ
ಗುರುಕರುಣದಿಂದ ನಿಜದೊಳಗೆ ಬೆರೆದಾತ
ನರಕ ಕೂಡುವನೆ ಸರ್ವಜ್ಞ ೧೭

ತ್ರಿಪದಿ॥ ಗುರುಸೇವೆ ಕೈಕೊಂಡು ಹಿರಿದಾಗಿ ಮಾಡದಲೆ
ಹರಿದೇರಿ ಮುಕ್ತಿಪಡೆಯುವದೆ ಅದುತಾನು
ಹಿರಿದಾದತನರೆ ಸರ್ವಜ್ಞ ೧೮

తే॥ గీ॥ పెరటి చెట్టౌచు నెద్దౌచు భృత్యుడౌచు
కాలి జోడౌచు గురుని కైంకర్యమునకు
తనువుదాపక చెంతనె మనగవలయు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 13

తే॥ గీ॥ మూడు ఆరగు మరి ఆరు ముందుముందు
పదియురెండగు వర్ధిల్లి ప్రగతి గనుచు
వంజ పాలిచ్చు గురుదయా భాగ్యమున్న
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 14

తే॥ గీ॥ గురువు వలననె బందుగుల్. సురగణంబు
గురువు వలననె పుణ్యంబు పరమ పదము
ఇజ్జగంబున కెల్లను ఇదియె నిజము
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 15

తే॥ గీ॥ సురభి పసిగాదు కల్పము తరువుగాదు
పరుస వేదియు శిలగాదు, నరుడటంచు
గురువరేణ్యుని యనగాదు ధరణియందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 16

తే॥ గీ॥ అగ్ని దవిలిన కర్పూరమమ్మ బడున
లెస్స గురుకృప బరమున లీనమైన
మనుజవర్యుడు నరకమ్ము గనునదెట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 17

తే॥ గీ॥ గురుని పదసేవ గైకొని నిరతముగను
ముమ్మరము జేయకున్నను ముక్తిఫలము
పొందునాతడు తొలిజన్మ పుణ్యజనుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర.. 18

# ದೈವ

ತ್ರಿಪದಿ॥ ಒಬ್ಬನಲ್ಲದೆ ಜಗಕೆ ಇಬ್ಬರುಂಟೇ ಮತ್ತೆ
ಒಬ್ಬ ಸರ್ವಜ್ಞ ಕರ್ತನೀ ಜಗಕೆಲ್ಲ
ಒಬ್ಬನೇ ದೈವ ಸರ್ವಜ್ಞ ೧೯

ತ್ರಿಪದಿ॥ ಆದೇವ ನೀದೇವ ಮಾದೇವ ನೆನಬೇಡ
ಆ ದೇವರ ದೇವ ಭುವನದ ಪ್ರಾಣಿಗಳಿ-
-ಗಾದವನೆ ದೇವ ಸರ್ವಜ್ಞ ೨೦

ತ್ರಿಪದಿ॥ ಚಿತ್ರವನು ನವಿಲೊಳು ವಿಚಿತ್ರವನು ಗಗನದೊಳು
ಪತ್ರಪುಷ್ಪಗಳ ವಿವಿಧ ವರ್ಣಗಳಿಂದ
ಚಿತ್ರಿಸಿದರಾರು ಸರ್ವಜ್ಞ ೨೧

ತ್ರಿಪದಿ॥ ಇಂಗಿನೋಳ್ ನಾತವನು ತೆಂಗಿನೊಳಗೆಳನೀರ
ಭೃಂಗ ಕೋಗಿಲೆಯ ಕಂಠದೊಳು ಗಾಯನವ
ಹಿಂಗಿಸಿದರಾರು ಸರ್ವಜ್ಞ ೨೨

ತ್ರಿಪದಿ॥ ತೆಪ್ಪವನು ನಂಬಿದೊಡೆ ತಪ್ಪದಲೆ ತಡಿಗಹುದು
ಸರ್ಪಭೂಷಣನ ನಂಬಿದೊಡೆ ಭವಪಾಶ
ತಪ್ಪಿಹೋಗುವದು ಸರ್ವಜ್ಞ ೨೩

ತ್ರಿಪದಿ॥ ದೇಹ ದೇವಾಲಯವು ಜೀವವೇ ದೈವವು
ಬಾಹ್ಯಂಗಳಳಿದು ಭಜಿಪಂಗೆ ಮುಕ್ತಿ ಸಂ–
–ದೇಹವಿಲ್ಲೆಂದ ಸರ್ವಜ್ಞ ೨೪

# దైవము

తే॥ గీ॥ ఒక్కడే కాని మరియిద్దరుండ గలరె
సకల జగతికి సర్వజ్ఞుడొకడె కర్త
స్వామి పరమాత్మ యొక్కడే సర్వమునకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 19

తే॥ గీ॥ చనెద రాదేవు డీదేవు డనుచు జనులు
అఖిల ప్రాణుల కృపతోడ నాదరించి
జూచునాతండె దేవుడు సుమ్మ జగతి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 20

తే॥ గీ॥ చిత్ర వర్ణాలు నెమలిపై చిలుకరించె
పత్ర పుష్పాల వన్నెల పలుకరించె
నింగి రంగులనించె నే నేర్పుకాడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 21

తే॥ గీ॥ ఇంగువకు వాసనయు, పిక భృంగతతికి
గాన మధురిమ, లేత టెంకాయ యందు
జలము తీపిని నెవ్వాడు కలుగ జేసె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 22

తే॥ గీ॥ నదిని దాటంగ తెప్పను నమ్మియున్న
తెప్ప చేర్చును తీరంబు నొప్పుమీర
నమ్ముమభవుని భవబంధనమ్ము తొలగు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 23

తే॥ గీ॥ తనువు కోవెల జీవమే దైవమనుచు
శుద్ధ బుద్ధిని భజియింప శుద్ధుడగును
ముక్తినందును సందేహ మొందనేల
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 24

ತ್ರಿಪದಿ॥ ಇಂದ್ರನಾಣೆಯನೇರಿ ಒಂದನೂ ಕೊಡಲರಿಯ
ಚಂದ್ರಶೇಖರನು ಮುದಿಯೆತ್ತನೇರಿ ಬೇ-
-ಕೆಂದುದನು ಕೊಡುವ ಸರ್ವಜ್ಞ

ತ್ರಿಪದಿ॥ ನಿಷ್ಠೆ ಇದ್ದರೆ ಶಿವನು ಗಟ್ಟಿಗೊಂಡೊಳಗಿಪ್ಪ
ನಿಷ್ಠೆ ಇಲ್ಲದೆ ಭಜಿಸಿದೊಡೆ ಶಿವನವನ
ಬಿಟ್ಟು ಬಯಲಪ್ಪ ಸರ್ವಜ್ಞ

ತ್ರಿಪದಿ॥ ದೇವರನು ನೆನೆವಂಗೆ ಭಾವಿಪುದು ಬಂದಿಹುದು
ದೇವರನ ನೆನೆಯದಧಮಂಗೆ ಇಹಪರದಿ
ಆವುದೂ ಇಲ್ಲ ಸರ್ವಜ್ಞ

ತ್ರಿಪದಿ॥ ತೋಡಿರ್ದ ಭಾವಿಂಗೆ ಕೂಡಿರ್ದ ಜಲಸಾಕ್ಷಿ
ಮಾಡಿರ್ದ ಕೆಲ್ಲ ಮನ ಸಾಕ್ಷಿ ಸರ್ವಕ್ಕು
ಮೃಡನೆ ತಾ ಸಾಕ್ಷಿ ಸರ್ವಜ್ಞ

ತ್ರಿಪದಿ॥ ಕಲ್ಲಿನಲಿ ಕುಚದಲ್ಲಿ ಬಳ್ಳದಲಿ ಹಿಕ್ಕೆಯಲಿ
ಎಲ್ಲಿ ಭಾವಿಸಿದೊಡಲ್ಲಿರ್ಪ ದೈವವನು
ಬಲ್ಲವೇ ನಿಗಮ ಸರ್ವಜ್ಞ

ತ್ರಿಪದಿ॥ ಎಲ್ಲವೂ ಶಿವನೆಂದರೆಲ್ಲಿಹುದು ಭಯವಯ್ಯ
ಎಲ್ಲರೂ ಶಿವನ ನೆನೆದಿಹರೆ ಕೈಲಾಸ-
-ವಿಲ್ಲಿಯೇ ನೋಡ ಸರ್ವಜ್ಞ

తే॥ గీ॥ ఇంద్రు డేనుగునెక్కి యేమీయలేదు;
బక్క ముసలెద్దునెక్కెడి పరమశివుడు
ఏమి కోరిన నదియిచ్చు; నెంతవింత?
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 25

తే॥ గీ॥ నియమ నిష్ఠల సర్వేశు నిరతముగను
కొలువ నీ యందు దృఢముగా నిలిచియుండు
నియమ నిష్ఠలు విడనాడ నిన్నువిడుచు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 26

తే॥ గీ॥ ధ్యానపరుడైన నరునకు దైవమెపుడు
కోరునది యెల్ల నిచ్చును కొమ్మటంచు
ఏమి లేదెందు ఖలునకు ఇహపరముల
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 27

తే॥ గీ॥ త్రవ్వినందుకు నూతి నీరములు సాక్షి
తనదు కర్మలకెల్ల చిత్తమ్మె సాక్షి
సకల కర్మలకెల్ల నీశ్వరుడె సాక్షి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 28

తే॥ గీ॥ శిలల, కుచముల, ధాన్యాల, చెత్త లందు
తావులేవైన భావింప దైవమచట
నిండియున్నటు లెరుగునా నిగమచయము
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 29

తే॥ గీ॥ సకలకార్య కారణకర్త శంభుడనుచు
నియతినుండెడి వారికి భయమదేల
ఇదియె నమ్మిన కైలాసమిచట కాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 30

# ಭಕ್ತಿ

ತ್ರಿಪದಿ|| ಭಕ್ತಿಯಿಂದಲೆ ಮುಕ್ತಿ ಭಕ್ತಿಯಿಂದಲೆ ಶಕ್ತಿ
ಭಕ್ತಿ ವಿರಕ್ತಿಯಳಿದರೇ ಜಗದಲ್ಲಿ
ಮುಕ್ತಿಇಲ್ಲೆಂದ ಸರ್ವಜ್ಞ ೩೧

ತ್ರಿಪದಿ|| ಕಂಡವರು ಕೆರಳುವರು ಹೆಂಡತಿಯು ಕನಲುವಳು
ಖಂಡಿತದಿ ಲಕ್ಷ್ಮಿ ತೊಲಗುವಳು ಶಿವನೊಲಿಮೆ
ಕಂಡುಕೊಳದಿರಲು ಸರ್ವಜ್ಞ ೩೨

ತ್ರಿಪದಿ|| ಚಿತ್ತವಿಲ್ಲದೆ ಗುಡಿಯ ಸುತ್ತಿದಡೆ ಫಲವೇನು
ಎತ್ತು ಗಾಣವನು ಹೊತ್ತು ತಾನಿತ್ಯದೀ
ಸುತ್ತಿ ಬಂದಂತೆ ಸರ್ವಜ್ಞ ೩೩

ತ್ರಿಪದಿ|| ಕಡುಭಕ್ತನಾದರೂ ಜಡದಾರಿಯಾದರೂ
ನಡೆವ ವೃತ್ತಿಯಲಿ ನಡೆಯದಿರಲಾಭಕ್ತಿ
ಹೊಡೆವ ಶಂಖೆಂದ ಸರ್ವಜ್ಞ ೩೪

ತ್ರಿಪದಿ|| ಭಕ್ತಿಯೆಂಬುದೆ ಬೀಜ ಮುಕ್ತಿಯೆಂಬುದೆ ಫಲವು
ಯುಕ್ತಿಯಿಂ ವೃಕ್ಷವೇರಿದವಗೆ ಇಹದಲ್ಲಿ
ಮುಕ್ತಿ ಇಹುದೆಂದ ಸರ್ವಜ್ಞ ೩೫

ತ್ರಿಪದಿ|| ಸತಿಯರಿರ್ದಡೇನು ಸುತರಾಗಿ ಫಲವೇನು
ಶತಕೋಟಿ ಧನವ ಗಳಿಸೇನು ಭಕ್ತಿಯಾ
ಸ್ಥಿತಿಯಿಲ್ಲದನಕ ಸರ್ವಜ್ಞ ೩೬

# భక్తి

తే॥ గీ॥ భక్తి, సోపానమై నిల్చు ముక్తినంద
భక్తి, వైరాగ్య సంధాన శక్తినిచ్చు
భక్తి వైరాగ్య ములువీడ ముక్తి లేదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 31

తే॥ గీ॥ చూచువారలు చవటంద్రు నీచుడంద్రు
కాంత కనలును ధనలక్ష్మి గడపదాటు
ఖండితమ్మిది శివభక్తి యుండకున్న
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 32

తే॥ గీ॥ ఇలను గుడిచుట్టు దిరుగంగ ఫలముగలదె
చిత్త శుద్ధియు లేకున్న శివమదేడ
గానుగెద్దును తిరుగదే కాడిమోసి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 33

తే॥ గీ॥ భక్తుడైనను జడదాలుపైననేమి
తనదు వృత్తిని విడనాడ దలచువాని
భక్తి సార్థకమును గాదు ముక్తిలేదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 34

తే॥ గీ॥ భక్తి యనునది బీజము, ముక్తిఫలము
యుక్తిచే వృక్షమెక్కెడి యుత్తముండు
పరమ పదమును ఇహమందె బడయగలడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశి కేంద్ర. 35

తే॥ గీ॥ సతియు సుతులును గల్గిన సఫలమేమి
ధనము శతకోటి గడియింప దాననేమి
భక్తి యున్నతి బడయని వానిబ్రతుకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 36

# ಜ್ಞಾನ

ತ್ರಿಪದಿ॥ ಜ್ಞಾನದಿಂ ಮೇಲಿಲ್ಲ ಶ್ವಾನನಿಂ ಕೀಳಿಲ್ಲ
ಭಾನುವಿಂದಧಿಕ ಬೆಳಕಿಲ್ಲ ಜಗದೊಳಗೆ
ಜ್ಞಾನವೇ ಮಿಗಿಲು ಸರ್ವಜ್ಞ ೪೩

ತ್ರಿಪದಿ॥ ಎತ್ತಹೋದರು ಮನವು ಹತ್ತಿಕೊಂಡೇ ಬಹುದು
ಮತ್ತೊಬ್ಬ ಮುನಿದು ಕೊಳಲರಿಯ, ಜ್ಞಾನದಾ
ಬಿತ್ತು ಲೇಸೆಂದ ಸರ್ವಜ್ಞ ೪೪

ತ್ರಿಪದಿ॥ ನಾಟ ರಾಗವು ಲೇಸು ತೋಟ ಮಲ್ಲಿಗೆ ಲೇಸು
ಕೂಟವದು ಲೇಸು ಹಿರಿಯರೋಳ್, ಶಿವನ ಅರಿ–
–ದಾಟವೇ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೪೫

ತ್ರಿಪದಿ॥ ಜ್ಞಾನದಿಂದಲೆ ಇಹವು ಜ್ಞಾನದಿಂದಲೆ ಪರವು
ಜ್ಞಾನವಿಲ್ಲದಿರೆ ಸಕಲವೂ ತನಗಿದ್ದು
ಹಾನಿ ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೪೬

ತ್ರಿಪದಿ॥ ಜ್ಞಾನವುಳ್ಳವನೊಡಲು ಭಾನುಮಂಡಲದಂತೆ
ಜ್ಞಾನವಿಲ್ಲದನ ಬರಿಯೊಡಲು ಹಾಳೂರ
ಸ್ಥಾನದಂತಿಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೪೭

ತ್ರಿಪದಿ॥ ಕರ್ಮಿಗೆ ತತ್ವದ ಮರ್ಮ ದೊರಕೊಂಬುದೇ
ಚರ್ಮವನು ತಿಂಬ ಶುನಕಂಗೆ ಪಾಯಸದ

# జ్ఞానము

తే॥ గీ॥ జ్ఞానమును మించునది లేదు జగతియందు
జాగిలముకంటె హీనంపుజాతి లేదు
తరణి వెలుగుకు దీటైన దరయ లేదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 43

తే॥ గీ॥ ఎచట బోయిన మనమంటి నచటయుండు
కోపమునద్రుంచ పరునకు కుదురుపడదు
జ్ఞాన బీజము నాటంగ దానశించు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 44

తే॥ గీ॥ నాటు రాగము లెస్స! పూదోట మల్లె
లెస్స! సాధు సంగమ మది లెస్స! శివుని
తత్త్వ సారంబెరుంగుటే ధరణి లెస్స!
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 45

తే॥ గీ॥ ఇహపరంబుల జ్ఞానంబు ఇచ్చు సుఖము
జ్ఞానమదిలేక తనకునై సకలమున్న
హానియేకాని మోక్షంబు నందలేడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 46

తే॥ గీ॥ జ్ఞాని దేహంబు శోభిల్లు భాను పగిది
జ్ఞాన మెరుగని వట్టి యజ్ఞాని మేను
పాడు బడినూరు ప్రాంతంబు పగిదినుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 47

తే॥ గీ॥ కర్మి యెరుగున తత్త్వంపు గరువతనము
పాడు చర్మము దినుకుక్క పాయసమ్ము
స్వాద సంతృప్తి యెఱుగునా భేదమరసి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 48

ತ್ರಿಪದಿ|| ಬಲ್ಲೆನೆಂಬುವ ಮಾತು ಎಲ್ಲವೂ ಹುಸಿ ಕಾಣೊ
ಬಲ್ಲರೇ ಬಲ್ಲೆನೆನಬೇಡ ಸುಮ್ಮನಿರ
ಬಲ್ಲವನೆ ಬಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೪೯

ತ್ರಿಪದಿ|| ಸುಂದರಾಂಗನೆ ಬಂದು ಮುಂದೆ ತಾನಿಂದಿರಲು
ಸಂದರಿವ ನರಿದ ಜ್ಞಾನಿಯು ಎಲುವಿನ
ಹಂದರವು ಕಾಂಬ ಸರ್ವಜ್ಞ ೫೦

ತ್ರಿಪದಿ|| ಕ್ಷೀರದಲಿ ಘೃತ ವಿಮಲ ನೀರಿನೊಳು ಶಿಖಿಯಿರ್ದು
ಆರಿಗೂ ತೋರ ದದರಂತೆ ಎನ್ನೊಳಗೆ
ಸಾರಿಹನು ಶಿವನು ಸರ್ವಜ್ಞ ೫೧

ತ್ರಿಪದಿ|| ಆನೆ ಕನ್ನಡಿಯಲ್ಲಿ ತಾನಡಗಿ ಯಿಪ್ಪಂತೆ
ಜ್ಞಾನವುಳ್ಳವನ ಹೃದಯದಲಿ ಪರಶಿವನು
ತಾನಡಗಿಹನು ಸರ್ವಜ್ಞ ೫೨

ತ್ರಿಪದಿ|| ನೋಡಿದರೆ ನಾಡೊಳಗೆ ಬೇಡುವದು ಕಡುಪಾಪ
ಬೇಡಿದರೆ ಈಯದದು ಪಾಪ ಕೊಡುವವರ
ತಡೆವುದೇ ಪಾಪ ಸರ್ವಜ್ಞ ೫೩

ತ್ರಿಪದಿ|| ಜ್ಞಾನಿಗಜ್ಞಾನಿಗೂ ತಾನೊಂದು ಕುರುಹುಂಟು
ಏನೊಂದ ನಾತನುಡಿದರೇ ಜ್ಞಾನಿ ತಾ
ಮೌನವಾಗಿಹನು ಸರ್ವಜ್ಞ ೫೪

తే॥ గీ॥ సకల మెరుగుదు సనుట వాస్తవము కాదు
ఎరుక యున్నను అనరాదు ఎరుగుదనుచు
మౌన మెరిగిన వాడెపో జ్ఞానధనుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 49

తే॥ గీ॥ అందమును చిందు సుందరి ముందు నిలువ
తత్త్వ మెరిగిన జ్ఞాని యాతన్వి యందు
అస్థి పంజరమును జూచు నచ్చుపడగ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 50

తే॥ గీ॥ నీరములనగ్ని ఘృతమది క్షీరమునను
గాను పించని తెరగు నీలోన శివుడు
దాగియున్నాడు వెదకుమా తత్త్వమరసి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 51

తే॥ గీ॥ హస్తి యద్దమునందు తానడగునట్లు
జ్ఞానమొదవిన హృదయాన తానడంగి
అలరుచుండును భవరోగహరుడు భవుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 52

తే॥ గీ॥ వేడు మనుగడ పాపంబు పృథివియందు
వేడగా నీయకుండిన వృజినమంటు
ఇచ్చువారిని తడయుట నెక్కుడఘము
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 53

తే॥ గీ॥ జ్ఞానికజ్ఞానికిని సంజ్ఞ గాంచవచ్చు
జ్ఞాన హీనుడు నెరసు లేమైన పలుక
మౌనము వహించి తానుండు జ్ఞానధనుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 54

# ದಾನ

ತ್ರಿಪದಿ|| ಗಾನವಿದ್ಯವು ಲೇಸು ಮಾನವತಿ ಸತಿ ಲೇಸು
ಸ್ವಾನುಭಾವಿಗಳ ಕಳೆಲೇಸು ಎಲ್ಲಕ್ಕು
ದಾನಿಯೇ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೫೫

ತ್ರಿಪದಿ|| ಈವಂಗೆ ದೇವಂಗೆ ಆವುದಂತರವಯ್ಯ
ದೇವನು ಜಗಕೆ ಕೊಡುತಿಹನು, ಕೈಯಾರೆ
ಈವನೇ ದೇವ ಸರ್ವಜ್ಞ ೫೬

ತ್ರಿಪದಿ|| ಅನ್ನವನು ಇಕ್ಕುವುದು ನನ್ನಿಯನು ನುಡಿಯುವುದು
ತನ್ನಂತೆ ಪರರ ಬಗೆದೊಡೆ ಕೈಲಾಸ
ಬಿನ್ನಾಣವಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೫೭

ತ್ರಿಪದಿ|| ಸಿರಿ ಬಂದ ಕಾಲಕ್ಕೆ ಕರೆದು ದಾನವ ಮಾಡು
ಪರಿಣಾಮವಕ್ಕು ಪದವಕ್ಕು ಕೈಲಾಸ
ನೆರೆಮನೆಯು ಅಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೫೮

ತ್ರಿಪದಿ|| ಸ್ವಾತಿಯಾ ಹನಿಬಿದ್ದು ಜಾತಿ ಮುತ್ತಾದಂತೆ
ಸಾತ್ವಿಕನು ಅಪ್ಪ ಯತಿಗಿಕ್ಕೆ ಪಂಚಮಾ
ಪಾತಕವು ಕೆಡಗು ಸರ್ವಜ್ಞ ೫೯

ತ್ರಿಪದಿ|| ಕೊಟ್ಟಿದ್ದು ತನಗೆ ಬಚ್ಚಿಟ್ಟಿದ್ದು ಪರರಿಂಗೆ
ಕೊಟ್ಟಿದ್ದು ಹೋಯಿತೆನಬೇಡ ಮುಂದಕ್ಕೆ
ಕಟ್ಟಿಹುದು ಬುತ್ತಿ ಸರ್ವಜ್ಞ ೬೦




# దానము

తే॥ గీ॥ వినుత సతి మిన్న: ఘన గానవిద్య మిన్న:
స్వానుభావుల లలితానుభవము మిన్న
అన్నిటను దానగుణి మిన్న యవనియందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 55

తే॥ గీ॥ దైవమునకును దాతకంతరము లేదు
దైవ మిచ్చును బ్రోచును జీవకోటి
వార కిచ్చెడి దాత దైవంబు కాడె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 56

తే॥ గీ॥ అన్నమిడువారు సత్యము నాడువారు
తనవలెనె యెల్లవారిని గనెడువారు
జేరుచుందురు కైలాస శిఖర వనికి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 57

తే॥ గీ॥ కలిమి గలనాడు దానమ్ము పిలిచియిడిన
ఫలము పరిణామమై వచ్చు పదవినిచ్చు
పరమపద భాగ్యమే తనకిరవు నగును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 58

తే॥ గీ॥ తనియ సాత్త్వికునరసి తా దానమిడిన
స్వాతి చినుకది ముత్యమై పండినట్లు
పంచవిధ పాపపుంజముల్ బాసిపోవు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 59

తే॥ గీ॥ దానమిచ్చినదదంతయు తనదెయగును
పదిలముగ దాచునదియెల్ల పరులదగును
చెడితి నీవిచే ననకది శివుని జేరు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 60

ತ್ರಿಪದಿ॥ ಕೊಟ್ಟು ಕುದಿಯಲುಬೇಡ ಕೊಟ್ಟಾಡಿ ಕೊಳಬೇಡ
ಕೊಟ್ಟು ನಾಕೆಟ್ಟೆನೆನಬೇಡ, ಶಿವನಲ್ಲಿ
ಕಟ್ಟೆಹುದು ಬುತ್ತಿ ಸರ್ವಜ್ಞ ೬೧

ತ್ರಿಪದಿ॥ ಆಗಬಾ ಈಗಬಾ ಹೋಗಿಬಾ ಎನ್ನದಲೆ
ಆಗಲೇ ಕರೆದು ಕೊಡುವವರ ಧರ್ಮ ಹೊ-
-ನ್ನಾಗದೇ ಬಿಡದು ಸರ್ವಜ್ಞ ೬೨

ತ್ರಿಪದಿ॥ ಸೂಕ್ಷ್ಮವಾದರು ಒಂದು ಭಿಕ್ಷವೀಯಲೆಬೇಕು
ಅಕ್ಷಯಪಾತ್ರೆ ತನಗಕ್ಕು ಮೋಕ್ಷವದು
ತತ್‌ಕ್ಷಣವೆ ಅಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೬೩

ತ್ರಿಪದಿ॥ ಆಡದೇ ಕೊಡುವವನು ರೂಢಿಯೊಳಗುತ್ತಮನು
ಆಡಿಕೊಡುವವನು ಮಧ್ಯಮ, ನಧಮ ತಾ-
-ನಾಡಿ ಕೊಡದವನು ಸರ್ವಜ್ಞ ೬೪

ತ್ರಿಪದಿ॥ ಇಚ್ಛೆಯನು ಅರಿದಿತ್ತ ನುಚ್ಚೊಂದು ಮಾಣಿಕವು
ಇಚ್ಛೆಯನು ತೀರ್ದ ಬಳಿಕಿತ್ತ ಮಾಣಿಕವು
ನುಚ್ಚಿಗೂ ಕಷ್ಟ ಸರ್ವಜ್ಞ ೬೫

ತ್ರಿಪದಿ॥ ಅಂದಳವನೇರುವರೆ ಅಂದದಲಿ ಸುಖಿಸುವರೆ
ಮುಂದಗಮನೆ ಸಿರಿದೊರಿಯುವರೆ, ಹಸಿದರಿಗೆ
ಚಂದದಿಂದಿಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೬೬

తే॥ గీ॥ ఇచ్చి చింతించకుము నేనయిచ్చితనకు
చేటుగల్గెను ఇచ్చుట చేతననకు
శివుని జేరగనది చల్ది చిక్కమగును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 61

తే॥ గీ॥ రేపురా మాపురా మళ్ళి రాపొాయనక
అప్పుడే పిల్చియిచ్చెడి యతులమతుల
భాగ్య మేమందు బంగారు పంటగాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 62

తే॥ గీ॥ అంచితంబగు దానమ్ము కొంచెమైన
పావనంబగు నక్షయ పాత్రయగును
మరియు మోక్షమ్ము కరతలామలకమగును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 63

తే॥ గీ॥ ఇత్తునని చెప్పకే యిచ్చు నుత్తముండు
మాటలాడిచ్చుచుండును మధ్యముండు
ఆడి యీయగ లేని వాడధమ జనుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 64

తే॥ గీ॥ మనసు నరసిచ్చు తృణమైన మానికంబు
మరి యదియెతీర నాడిచ్చు మానికంబు
గణనకేరాదు పోలదు తృణము కైన
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 65

తే॥ గీ॥ అందలములెక్కి భోగాల ననుభవింత్రు
మదవతుల పొందు, సంపద లందగలరు
అనదలాకలి దీర్చెడి యలఘు మతులు

# ಲೋಭ

ತ್ರಿಪದಿ॥ ಉಣ್ಣದೊಡೆವೆಯಗಳಿಸಿ ಮಣ್ಣಿನೊಳು ತಾನಿರಿಸಿ
ಸಣ್ಣಿಸಿ ನೆಲ ಸಾರಿದನ ಬಾಯೊಳಗೆ
ಮಣ್ಣು ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೬

ತ್ರಿಪದಿ॥ ಉಣ್ಣೆ ಕೆಚ್ಚಲೊಳಿರ್ದು ಉಣ್ಣದದು ನೊರೆಹಾಲ
ಪುಣ್ಯವಮಾಡಿ ಉಣಲೊಲ್ಲದವನಿರವು
ಉಣ್ಣೆಗೂ ಕಷ್ಟ ಸರ್ವಜ್ಞ ೬

ತ್ರಿಪದಿ॥ ಕಾಗೆಯಗಳನು ಕಂಡು ಕೂಗುವದು ಬಳಗವನು
ಕಾಗೆ ಕೋಳಿಗಳ ತೆರೆದುಣ್ಣದವ ನಿರವು
ಕಾಗೆಗೂ ಕಷ್ಟ ಸರ್ವಜ್ಞ ೬

ತ್ರಿಪದಿ॥ ಬಿದಿರೆ ಅಂದಣವಕ್ಕು ಬಿದಿರೆ ಸತ್ತಿಗೆಯಕ್ಕು
ಬಿದಿರಿಂದ ಸಕಲ ಪದಪಕ್ಕು ಲೋಕದೋಳ್
ಬಿದಿರದವ ಕೆಟ್ಟ ಸರ್ವಜ್ಞ ೭

ತ್ರಿಪದಿ॥ ಮಾನವನ ದುರ್ಗುಣವ ನೇನೆಂದು ಬಣ್ಣಿಪೆನು
ದಾನಗೆಯ್ಯನಲು ಕನಲುವನು ದಂಡವನು
ಮೌನದೀಯುವನು ಸರ್ವಜ್ಞ ೭

ತ್ರಿಪದಿ॥ ಕಳ್ಳರಿಗೆ ಸುಳ್ಳರಿಗೆ ಡೊಳ್ಳರಿಗೆ ಡೊಂಬರಿಗೆ
ಸುಳ್ಳು ಗೊರವರಿಗೆ ಕೊಡುವವರು ಧರ್ಮಕ್ಕೆ
ಎಳ್ಳಷ್ಟು ಕೊಡರು ಸರ್ವಜ್ಞ ೭

# లోభము

తే॥ గీ॥ కుడుచుటయు మాని తొడవులు గడనజేసి
మట్టిలో దాచి సవరించి మరుగుపరచు
పాపి కృపణు నోటను మట్టి బడునుకనుమ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 67

తే॥ గీ॥ పిడుదు పొదుగంటియును పాలు గుడువలేదు
గడన కలిగియు కుడువడు పిడుదు పోలె
పిడుదు కన్నను లోభితా చెడిన వాడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 68

తే॥ గీ॥ కాకి మెతుకు గాంచిన బలగమును పిలుచు
కోడి గుణమింతె, కాకులు కోళ్ళ పగిది
కాని మనుజుండు నీచుడా కాకికన్న
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 69

తే॥ గీ॥ వినయమందలమెక్కించు! వినయముననె
ఛత్రమునుగల్గు మరియు రాచరికమబ్బు
వినయమును వీడ మనుజుండు వెతలపాలు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 70

తే॥ గీ॥ మనుజు దుర్గుణమేమని యనగవచ్చు
దానమిమ్మన్న కోపాన దరిమితిట్టు
మౌనమున దండమిచ్చును మహిని జూడ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 71

తే॥ గీ॥ దొంగ దబ్బరి డొల్లరి దొమ్మరులకు
కల్ల గౌరవయ్యలకు ఇత్తురుల్లమలర
ధర్మమడిగిన నూగింజ దాటనీరు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 72

ತ್ರಿಪದಿ|| ಕಂಡವರ ದಂಡಿಸುತ ಕೊಂಡವರ ವೊಡವೆಗಳ
ನುಂಡುಂಡು ಮಲಗಿ ಮಡಿದ ಮೇಲವನ, ಯಮ
ದಂಡಿಸದೆ ಬಿಡನು ಸರ್ವಜ್ಞ ೭೩

ತ್ರಿಪದಿ|| ಉಳ್ಳಲ್ಲಿ ಉಣಲಿಲ್ಲ ಉಳ್ಳಲ್ಲಿ ಉಡಲಿಲ್ಲ
ಉಳ್ಳಲ್ಲಿ ದಾನ ಕೊಡಲಿಲ್ಲದವ ನೊಡವೆ
ಕಳ್ಳರಿಗೆ ನೃಪಗೆ ಸರ್ವಜ್ಞ ೭೪

ತ್ರಿಪದಿ|| ಇದ್ದಾಗ ಉಣಲಿಲ್ಲ ಎದ್ದಾಗ ಉಣ್ಣುವನೆ
ಬಿದ್ದ ದೇಹವನು ಗುದ್ದಿ ಒಳಗಿಡುವಾಗ
ಬುದ್ಧಿ ಬಂದಿಪುದೆ ಸರ್ವಜ್ಞ ೭೫

ತ್ರಿಪದಿ|| ಬೇವು ಫಲವಾಗಲದು ಸೇವಿಸಲು ಯೋಗ್ಯವೇ
ಗಾವಿಲನ ಧನವು ಘನವಾಗಿ ಬೈಚಿಟ್ಟು
ಠಾವಿಲೇ ಪೋಕು ಸರ್ವಜ್ಞ ೭೬

ತ್ರಿಪದಿ|| ಆರಿಗಾದರು ಒಂದು ತಾರವನು ಕೊಡ ಲೋಭಿ
ಮಾರಿ ಬಂದೆಳದು ಕೊಲುವಾಗ ಗಳಿಸಿದಿದು
ಆರಿಗಾಗುವುದು ಸರ್ವಜ್ಞ ೭೭

ತ್ರಿಪದಿ|| ಎರೆಯಲೊಲ್ಲದ ಲೋಭಿ ಕರೆಯಲೊಲ್ಲದ ಆವು
ಬರಿಗಾಲುಪಯಣ ಈ ಮೂರು ತನ್ನತಾ
ನಿರಿದು ಕೊಂಡಂತೆ ಸರ್ವಜ್ಞ ೭೮

గీ॥ తనదు దృష్టికి బడువాని దాటనొలిచి
వాడిసొమ్ములు కాజేయు వాడుజావ
యముడు దండింపకుండు నా యంతకంత
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 73

॥ గీ॥ కలిమి గలనాడు తినక తాగట్ట లేక
కలుగ దానమ్ము నిడని యా కలిమియెల్ల
దొరల దొంగల జేరును ధరణియందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 74

॥ గీ॥ ఉండినప్పుడు దినని వాడూడినపుడు
తినున? తినలేడు, పడియున్న తనువు నీడ్చి
మట్టిలో బూడ్చుగా బుద్ధి పుట్టునెట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 75

॥ గీ॥ వేప పండైన తినుటకు వీలుపడదు
లోభి విత్తంబు సుఖమీదు లోకమునకు
మట్టి దాచిన చోటనే మాయమగును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 76

తే॥ గీ॥ ఏరికైనను కాసైన నియ్యకొనని
గావిలుని మారికా రోగమావరింప
వాడి విత్తంబదేరికో ఏడజనునొ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 77

తే॥ గీ॥ పితుక నీయని ఆవును, పిసినిగొట్టు;
పాదుకలు లేక పయనించు బాటసారి,
తనదు చేటును తాదెచ్చుకొనిన యట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 78

# ಕುಲ

ತ್ರಿಪದಿ|| ಕುಲವಿಲ್ಲಯೋಗಿಗೆ ಚಲವಿಲ್ಲ ಜ್ಞಾನಿಗೆ
ತೊಲೆಗಂಬವಿಲ್ಲ ಗಗನಕ್ಕೆ, ಸ್ವರ್ಗದಲಿ
ಹೊಲೆಗೇರಿಯಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೭೯

ತ್ರಿಪದಿ|| ಎಲುವಿಲ್ಲನಾಲಿಗಿಗೆ ಬಲವಿಲ್ಲ ಬಡವಂಗೆ
ತೊಲೆಗಂಬವಿಲ್ಲ ಗಗನಕ್ಕೆ, ದೇವರಲಿ
ಕುಲಭೇದವಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೮೦

ತ್ರಿಪದಿ|| ಉತ್ತಮರು ಪಾಲ್ಗಡಲೊಳೆತ್ತಿಹರೆ ಜನ್ಮವನು
ಉತ್ತಮರು ಅಧಮರೆನಬೇಡ, ಹೊಲೆಯಿಲ್ಲ-
-ದುತ್ತಮರು ಎಲ್ಲಿ ಸರ್ವಜ್ಞ ೮೧

ತ್ರಿಪದಿ|| ಎಲು, ತೊಗಲು, ನರ, ಮಾಂಸ ಬಲಿದ ಚರ್ಮದ ಹೊದಿಕೆ
ಹೊಲೆ ರಕ್ತ ಶುಕ್ಲದಿಂದಾದ ದೇಹಕ್ಕೆ
ಕುಲವಾವುದಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೮೨

ತ್ರಿಪದಿ|| ನಡೆವದೊಂದೇ ಭೂಮಿ ಕುಡಿವುದೊಂದೇ ನೀರು
ಸುಡವಗ್ನಿಯೊಂದೆ ಇರುತಿರಲು ಕುಲಗೋತ್ರ
ನಡುವೆ ಎತ್ತಣದು ಸರ್ವಜ್ಞ ೮೩

ತ್ರಿಪದಿ|| ಜಾತಿ ಹೀನರ ಮನೆಯ ಜ್ಯೋತಿ ತಾ ಹೀನವೇ
ಜಾತಿ ವಿಜಾತಿ ಯೆನಬೇಡ ದೇವನೊಲಿಸಿ-
-ದಾತನೇಜಾತ ಸರ್ವಜ್ಞ ೮೪

# కులము

తే॥ గీ॥ కులము యోగికి, జ్ఞానికి ఛలము లేదు
అంటు గంబము దూలము మింటలేదు
విబుధ లోకాన చండాల వీధి లేదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 79

తే॥ గీ॥ లేదెముక నాల్క, బడుగుకు లేదు బలము
నిలువు గంబము దూలమ్ము నింగిలేదు
వర్ణభేదము లేదు సర్వాత్మనందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 80

తే॥ గీ॥ ఉత్తములు పొల్కడలి జన్మమెత్తిరొక్కొ
ఉత్తమాధములను భేద మెత్తనేల
క్రొత్త మార్గాన పుట్టిరా యుత్తములును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 81

తే॥ గీ॥ రక్తమాంస మస్థికల చర్మంబుగప్పి
శుక్ల శోణిత సంధాన శోభ వెలయ
మొలక నెత్తిన దేహికి కులమదేడ?
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 82

తే॥ గీ॥ మనుజులెల్లరు నడుచు భూమాతయొకటె
త్రావు నీరము, కాల్చెడి అగ్ని యొకటె
యుండ, కులగోత్రములవెట్లు నుట్టి పడియె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 83

తే॥ గీ॥ హీనకులునింట దీపమ్ము హీనమగునె
కులము లెంచకు కులములు కులములనుచు
శివుని కరుణకు పాత్రుడే శ్రేష్ఠ కులుడు

ತ್ರಿಪದಿ॥ ಯಾತರದ ಹೂವೇನು ನಾತಿರಲು ಸಾಲದೇ
ಜಾತಿ ವಿಜಾತಿ ಯೆನಬೇಡ, ದೇವನೊಲಿಸಿ
ದಾತನೇಜಾತ ಸರ್ವಜ್ಞ ೮೫

ತ್ರಿಪದಿ॥ ಮಾತನರಿದಾ ಸುತನು, ರೀತಿಯರಿದಾ ಸತಿಯು,
ನೀತಿಯನು ಅರಿವ ವಿಪ್ರ ತಾ ಜಗದೊಳಗೆ
ಜ್ಯೋತಿ ಯಿದ್ದಂತೆ ಸರ್ವಜ್ಞ ೮೬

ತ್ರಿಪದಿ॥ ಹಸಿವು ತೃಷೆ ನಿದ್ರೆಗಳು ವಿಷಯ ಮೈಥುನ ಬಯಕೆ
ಪಶುಪಕ್ಷಿನರಗೆ ಸವನಿರಲು ಕುಲವೆಂಬ
ಘಸಣೆ ಯೆತ್ತಣದು ಸರ್ವಜ್ಞ ೮೭

ತ್ರಿಪದಿ॥ ಉತ್ತಮದ ವರ್ಣಗಳೆ ಉತ್ತಮರು ಎನಬೇಡ
ಮತ್ತೆ ತನ್ನಂತೆ ಬಗೆಯುವವರೆಲ್ಲರನು
ಉತ್ತಮರು ಎನ್ನು ಸರ್ವಜ್ಞ ೮೮

ತ್ರಿಪದಿ॥ ಎಲುಕರುಳು ನರಮಾಂಸ ಬಿಲ ಚರ್ಮರಂಧ್ರದೊಳು
ಹಲವು ತರ ಮಲವು ಸುರಿತಿರಲು ಕುಲಕಿನ್ನು
ಒಲವುಂಟೆ ಹೇಳು ಸರ್ವಜ್ಞ ೮೯

ತ್ರಿಪದಿ॥ ಅವಯವಗಳೆಲ್ಲರಿಗೆ ಸವನಾಗಿ ಇರುತಿರಲು
ಭವಿ ಭಕ್ತ ಶ್ವಪಚ ಶೂದ್ರರಿವರಿಂತೆಂಬ
ಕವನ ವೆತ್ತಣದು ಸರ್ವಜ್ಞ ೯೦

తే॥ గీ॥ పూవులేవైన పరిమళంబున్న చాలు
జాతి పరజాతి యనియెంచు సరణివిడుము
దైవ సంప్రీతి కరుడెపో ధన్యకులుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 85

తే॥ గీ॥ ఇంగితజ్ఞాన మెదయందు పొంగుసుతుడు
రీతిమతిభార్య విప్రుండు నీతిపరుడు
ప్రగతి జ్యోతుల యట్టులీ జగతియందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 86

తే॥ గీ॥ తృషయు నాకలి నిద్రయు విషయసుఖము
మనుజ సమముగ ప్రాణుల కెనయనుండ
కులములేరీతి యుదయించి కలతదెచ్చె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశి కేంద్ర. 87

తే॥ గీ॥ ధరణినుత్తమ కులులు నుత్తములుకారు
పరుని తనవలె నెంచెడి కరుణ హృదయు
లైన వారిని యుత్తములనగ వలయు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 88

తే॥ గీ॥ అస్థి, నర, మాంస, మజిన బిలాంత్రములను
పలువిధమ్ముల దుర్గంధ మలములోడు
కలుష దేహమ్మునకు నింక కులమదేది
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 89

తే॥ గీ॥ అవయవమ్ములు సమము మానవులకెల్ల
జూడ భవి భక్త శ్వపచులు శూద్రులనెడి
కవిత లెక్కడ పుట్టె నీ యవని యందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 90

# ವಿಧಿಲೀಲೆ

ತ್ರಿಪದಿ॥ ಕೆಡಕು ಕೊಡುವುದೆಂದು ಅಡಪಿಗೋಡಲು ಬೇಡ
ಕಡುಭಯದಿ ಭಂಗಗೊಳಬೇಡ ವಿಧಿಯರಿಯ-
-ದಡವಿ ಯೊಂದುಂಟೆ ಸರ್ವಜ್ಞ ೯೧

ತ್ರಿಪದಿ॥ ಹಿಂದೆ ಮಾಡಿದ ಕರ್ಮವೆಂದಿಗೂ ಬೆಂಬಿಡದು
ಬಂದ ಭೋಗವನು ತಿಂದು ತೀರಲೇಬೇಕು
ನೊಂದೆನೆನಬೇಡ ಸರ್ವಜ್ಞ ೯೨

ತ್ರಿಪದಿ॥ ಏ ನಾನು ನೆವದಿಂದ ತಾನೆ ಬಪ್ಪುದು ಸಿರಿಯು
ಕಾನನದಿ ಒಂದು ಕರಿಹುಟ್ಟಿ, ಪಟ್ಟಕ್ಕೆ
ತಾನೆ ಬಂದಂತೆ ಸರ್ವಜ್ಞ ೯೩

ತ್ರಿಪದಿ॥ ಏನಾನು ನೆವದಲಿ ತಾನೆ ಪೋಪುದು ಸಿರಿಯು
ಕಾನನದೊಳಗೆ ಕಿಡಿಪುಟ್ಟಿ ಕಾಡೆಲ್ಲ
ತಾನೆ ಬೆಂದಂತೆ ಸರ್ವಜ್ಞ ೯೪

ತ್ರಿಪದಿ॥ ಮೂರಿಟ್ಟರಾರಕ್ಕು ಆರು ಹನ್ನೆರಡಕ್ಕು
ಹೇರುವ ಗೊಡ್ಡು ಹಯನಕ್ಕು ಕರ್ಮತಾ
ಹಾರುವದಿನಕೆ ಸರ್ವಜ್ಞ ೯೫

ತ್ರಿಪದಿ॥ ಬಲಹೋದ ಕಾಲಕ್ಕೆ ನೆಲವೆದ್ದು ಬಡಿಯುವುದು
ಕುಲ, ಚಲ, ಕಲಹ, ಸಿರಿಯು, ಸಂಗ್ರಾಮಗಳು
ಬಲವಿರುವ ತನಕ ಸರ್ವಜ್ಞ ೯೬

# విధిలీల

తే॥ గీ॥ చెడుగగునటంచు నడవికింజేరబోకు
భయముచే బెంగనిడుకొని బాధపడకు
పుడమి విధిచూడజాలని యడవిగలదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 91

తే॥ గీ॥ వెనుక జేసిన కర్మనీ వేంటనుండు
దాని ఫలమును గుడువక దప్పదెపుడు
బాధచే బలుపాట్లు నే బడితిననకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 92

తే॥ గీ॥ వలచి వచ్చును సిరి యేనెపానసైన
కాననంబున నెక్కడో కరి జనించి
మహిని పట్టపు టేనుగై మనుట లేదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 93

తే॥ గీ॥ ఏదో నెపమునసైన తానేగు సిరియు
పచ్చనౌకాన బుట్టి కార్చిచ్చు రగిలి
సెగల నెగయుచు మసి బారజేయు రీతి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 94

తే॥ గీ॥ నెగడు మూడారు, ఆరు పండ్రెండునగుచు
గొడ్డు పసరము పాలిచ్చు కోర్కెదీర
కర్మ విడిపోవు నప్పుడు గలుగునిట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 95

తే॥ గీ॥ లేచి కొట్టును ఇల బల్మి లేనినాడు
కలహ, కుల, ఛల, శ్రీయు సంగ్రామములును
బలము తనకుండు వరకవి కలసి వచ్చు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 96

ತ್ರಿಪದಿ|| ಎಂಟೆಟ್ಟರೆರಡಕ್ಕು ನೆಂಟರುರೆ ಹಗೆಯಕ್ಕು
ದಂಟುಗಳೆದ್ದು ಹಾವಕ್ಕು ಕರ್ಮತಾ-
-ನಂಟುವದಿನಕೆ ಸರ್ವಜ್ಞ ೯೭

ತ್ರಿಪದಿ|| ಬಂದುದನೆ ತಾಹಾಸಿ ಬಂದುದನೆ ತಾಹೊದೆದು
ಬಂದುದೆಲ್ಲವನು ನುಂಗಿದರೆ ವಿಧಿಕರ್ಮ
ನಂದಿಹೋಗುವುದು ಸರ್ವಜ್ಞ ೯೮

ತ್ರಿಪದಿ|| ಕರ್ಮದಿಂದಲೆ ಹರನು ಚರ್ಮವನು ತಾನುಟ್ಟ
ಹೆಮ್ಮರಾಲ ವಜನಾದ ಗೋವಿಂದ
ನೆಮ್ಮೆಯನುಕಾದ ಸರ್ವಜ್ಞ ೯೯

ತ್ರಿಪದಿ|| ಅಕ್ಕರವ ತಡೆದಿಹುದು ಮುಕ್ಕಣ್ಣಗಳವಲ್ಲ
ರಕ್ಕಸನು ಸೀತೆ ಒಯ್ದಾಗ ಆರಾರು
ದಿಕ್ಕಾಗಲಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೦೦

ತ್ರಿಪದಿ|| ಹೆತ್ತಾತ ನರ್ಜುನನು ಮುತ್ತಯ್ಯ ದೇವೇಂದ್ರ
ಮತ್ತೆ ಮಾತುಲನು ಹರಿಯಿರಲು ಅಭಿಮನ್ಯು
ಸತ್ತನೇಕಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೧೦೧

ತ್ರಿಪದಿ|| ಪಾಲಿಸುವ ಶ್ರೀ ಹರಿಯು ಸೋಲನೆಂದೆನಬೇಡ
ಶೂಲಿತಾ ಮಗನ ತಲೆಚಿಗುಟೆ ಹರಿಯೇಕೆ
ಪಾಲಿಸದೆ ಹೋದ ಸರ್ವಜ್ಞ ೧೦೨

తే॥ గీ॥ ఎనిమిదుంచిన రెండగు, తనదుబంధు
వర్గమరులు నౌదురు దంట్లు పాములగును
కరకు కర్మము దానంటి గాసిబెట్టు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 97

తే॥ గీ॥ వచ్చునదియెల్ల పొన్పుగ పచ్చడముగ
జేయ, మరిమ్రింగ సహనమ్ముచే మెలంగ
భంగపాటొంది విధియు తా వదలిపోవు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 98

తే॥ గీ॥ చర్మమును గట్టె శంభుడు కర్మచేత
అజుడు చక్రాంగ పక్షిగా నవతరించె
పద్మనాభుడు పసులకాపరియు నయ్యె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 99

తే॥ గీ॥ కర్మ నిలువరింపడు కరకంఠుడైన
భూరిదైత్యుడు సీత గొంపోవునాడు
వానినాప గలిగిర? ఎవ్వారలైన
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 100

తే॥ గీ॥ తండ్రి విజయుడు సురపతి తాతగారు;
అమ్మకన్నయునైన యా హరియు గలుగ
మడిసె నభిమన్యు డని విధి మాయకాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 101

తే॥ గీ॥ హరికి ఓటమి లేదని యనుటకల్ల
అసమనేత్రుడు కుసుమాస్త్ర మసియొనర్ప
మిన్నకుండెను విధిలీల మీరతరమె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 102

# ಮಾತು

ತ್ರಿಪದಿ|| ಹೊತ್ತಿಗೊದಗದ ಮಾತು ಹತ್ತು ಸಾಸಿರವ್ಯರ್ಥ
ಕತ್ತೆಕೂಗಿದರೆ ಫಲವುಂಟೆ, ಬರಿಮಾತು
ಕತ್ತೆಗೂ ಕಷ್ಟ, ಸರ್ವಜ್ಞ ೧೦೩

ತ್ರಿಪದಿ|| ಹೊಲಬನರಿಯದ ಮಾತು ತಲೆಬೇನೆ ಎದ್ದಂತೆ
ಹೊಲಬರಿತು ಒಂದು ನುಡಿದರೆ, ಅದುದಿವ್ಯ
ಫಲಪಕ್ವದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೦೪

ತ್ರಿಪದಿ|| ಮಾತುಮಾತಿಗೆ ಆತು ಮಾತು ಕೋಟಿಗಳುಂಟು
ಮಾತಾಡೆ ಮನಕೆ ಮುನಿಸಕ್ಕು, ಮಾತಿನಲಿ
ಸೋತವನೆ ಜಾಣ ಸರ್ವಜ್ಞ ೧೦೫

ತ್ರಿಪದಿ|| ಮಾತಿನಿಂ ನಗೆ ನುಡಿಯು ಮಾತಿನಿಂ ಹಗೆ ಕೊಲೆಯು
ಮಾತಿನಿಂ ಸರ್ವ ಸಂಪದವು ಲೋಕಕ್ಕೆ
ಮಾತೆ ಮಾಣಿಕವು ಸರ್ವಜ್ಞ ೧೦೬

ತ್ರಿಪದಿ|| ಮಾತು ಬಲ್ಲಾತಂಗೆ ಏತವದು ಸುರಿದಂತೆ
ಮಾತಾಡಲರಿಯದಾತಂಗೆ, ಬರಿ ಯೇತ
ನೇತಾಡಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೦೭

ತ್ರಿಪದಿ|| ಮೆಲ್ಲನೆಯ ಸುರಿನೀರು ಕಲ್ಲಭೇದಿಸಲಕ್ಕು
ಸೊಲ್ಲರಿತು ನುಡಿವ ಒಳ್ನುಡಿಯು ಬಲ್ಲಂದ–
–ನಲ್ಲವೆನಿಸುವದು ಸರ್ವಜ್ಞ ೧೦೮

# మాట

తే॥ గీ॥ అదను కొదుగని పదివేల పదములేల
ఖరము తానోండ్ర పెట్టిన గలదె ఫలము
కాని పలుకులు హీనంబు ఖరముకంటె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర! 103

తే॥ గీ॥ పలుక నేటికి తలనొప్పి వచ్చుమాట
ఒప్పు తీరున పలికెడి దొక్కమాట
దివ్య ఫలపక్వ సారంబు తీరుగాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర! 104

తే॥ గీ॥ మాటమాటకు పొడిగింప కోటియగును
మాట పలికెడు తీరులో మనసు చెడును
మాట కోడిన వాడెపో మహిని ఘనుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర! 105

తే॥ గీ॥ పలుకు వలననె నవ్వులు వెలయగలవు
పలుకు వలననె మరణంపు పగయుగల్గు
పలుకె సంపద. రత్నమై బరగు జగతి.
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 106

తే॥ గీ॥ ఎరుకతో బల్క నేతము గురిసినట్లు
పలుక నేరుపు లేకున్న వాని పలుకు
ఉత్తయేతము నూతిలో నూగినట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 107

తే॥ గీ॥ జలము మెలమెల్ల బారినా శిలల దొలుచు
వినయ గుణశీల విజ్ఞుని విమల వాక్కు.
ప్రాజ్ఞునోడింప మురిపింప బరగు జగతి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 108

ತ್ರಿಪದಿ॥ ರಸಿಕನಾಡಿದ ಮಾತು ಶಶಿಯುದಿಸಿ ಬಂದಂತೆ
ರಸಿಕನಲ್ಲದನ ಬರಿಮಾತು ಕಿವಿಗೆ ಕೊ-
-ರ್ದಸಿಯು ಬಡಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೦೯

ತ್ರಿಪದಿ॥ ಹೊತ್ತಿಗೊದಗಿದ ಮಾತು ಸತ್ತವನು ಎದ್ದಂತೆ
ಹೊತ್ತಾಗಿ ನುಡಿದ ಬರಿಮಾತು ಕೈಜಾರಿದ
ಮುತ್ತಿನಂತಿಹುದು ಸರ್ವಜ್ಞ ೧೧೦

ತ್ರಿಪದಿ॥ ಮಾತು ಬಲ್ಲಾತಂಗೆ ಮಾತೊಂದು ಮಾಣಿಕವು
ಮಾತು ತಾನರಿಯದಧಮಂಗೆ, ಮಾಣಿಕವು
ತೂತುಬಿದ್ದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೧೧

ತ್ರಿಪದಿ॥ ಮಾತಿಂಗೆ ಮಾತುಗಳು ಓತು ಸಾಸಿರವುಂಟು
ಮಾತಾಡಿದಂತೆ ನಡೆದಾತ ಜಗವನ್ನು
ಕೂತಲ್ಲಿ ಆಳ್ವ ಸರ್ವಜ್ಞ ೧೧೨

ತ್ರಿಪದಿ॥ ಮಾತು ಬಲ್ಲಹ ತಾನು, ಸೋತುಹೋಹುದು ಲೇಸು
ಮಾತಿಂಗೆ ಮಾತು ಮಥಿಸಲ್ಕೆ. ವಿಧಿಬಂದು
ಆತುಕೊಂಡಿಹುದು ಸರ್ವಜ್ಞ ೧೧೩

ತ್ರಿಪದಿ॥ ಉದ್ದುರುಟು ಮಾತಾಡಿ ಇದ್ದುದನು ಹೋಗಾಡಿ
ಉದ್ದನಾ ಮರದ ತುದಿಗೇರಿ ತಲೆಯೂರಿ
ಬಿದ್ದು ಸತ್ತಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೧೪

తే॥ గీ॥ రసికుడాడిన పలుకుల పసదనమ్ము
శరద శశిబింబముదయించు సరణినొప్పు
శుంఠపలుకాడ శ్రుతికసి సోకినట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 109

తే॥ గీ॥ వలసినప్పుడు జ్ఞప్తికి వచ్చు పలుకు
చచ్చినాతడు మరిలేచి వచ్చినట్లు
జారిపోయిన ముత్యమౌ జ్ఞప్తిచెదర
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 110

తే॥ గీ॥ సారవాగ్ధార చతురుని సరసమైన
మాటయొక్కటి గణనీయ మణియునగును
ఓటి మానికమును పోలు నోగుమాట
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 111

తే॥ గీ॥ ఆచరింపక వేయి మాటాడవచ్చు
ఆడినది యాచరించిన ఆఢ్యుడతడు
జగతి పాలించు కూర్చుండి ప్రగతి మీర
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 112

తే॥ గీ॥ మాటలంతర మెరిగిన మనుజుడెపుడు
ఓటమిని యొప్పి దాబోవుచుంట లెస్స
మాటకును మాట పెంచిన జేటు వచ్చు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 113

తే॥ గీ॥ క్రొవ్వి మాటాడి సంపద గోలుపోవు
మనుజుడెట్లన పొడుగాటి మ్రాను నెక్కి
నేలతలగొట్టగా వంచి గూలు తెరగు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 114

# ಬಡತನ

ತ್ರಿಪದಿ।। ತುಂಬಿದ ಕೆರೆ ಬಾವಿ ತುಂಬಿದಂತಿರುವವೇ?
ನಂಬಿರಬೇಡ ಲಕ್ಷ್ಮಿಯನು, ಬಡತನವು
ಬೆಂಬಿಡದೆ ಬಹುದು ಸರ್ವಜ್ಞ ೧೧೫

ತ್ರಿಪದಿ।। ಒಡಕು ಮಡಿಕೆಯು ಹೊಲ್ಲ ಕುಡುಕ ನೆರೆಯೊಳು ಹೊಲ್ಲ
ಒಡಕಿನ ಮನೆಯೊಳಿರಹೊಲ್ಲ, ಬಡವಂಗೆ
ಸಿಡುಕು ತಾ ಹೊಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೧೬

ತ್ರಿಪದಿ।। ಹುಣಿಸೆಯಿಂ ನೊರೆಹಾಲು, ಗಣಿಕೆಯಿಂ ಹಿರಿತನವು
ಮೆಣಸಿನಿಂ ಕದಳಿ ಕೆಡುವಂತೆ ಬಡವ, ತಾ
ಸೆಣಸಿನಿಂ ಕೆಡುಗು ಸರ್ವಜ್ಞ ೧೧೭

ತ್ರಿಪದಿ।। ಆಡಿ ಅಳುಪಲು ಹೊಲ್ಲ ಕೂಡಿ ತಪ್ಪಲು ಹೊಲ್ಲ
ಕಾಡುವ ನೆಂಟ ಬರಹೊಲ್ಲ, ಧನಹೀನ
ನಾಡುವದೆ ಹೊಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೧೮

ತ್ರಿಪದಿ।। ಸಾಲ ಬಡವಗೆ ಹೊಲ್ಲ ಸೋಲು ಜೂಜಿಗ ಹೊಲ್ಲ
ಬಾಲಕರು ಬೆನ್ನಲಿರಹೊಲ್ಲ ಬಡವಂಗೆ
ಓಲಗವೆ ಹೊಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೧೯

ತ್ರಿಪದಿ।। ಬಡವ ಬಟ್ಟೆಯ ಹೋಗಲೊಡನೆ ಸಂಗಡವೇಕೆ
ಬಡತನವೆಂಬ ಹುಲಿಗೂಡಿ ಬರುವಾಗ
ನುಡಿಸುವವರಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೨೦

# బీదరికము

గీ॥ చెరువు నూతుల జలములు తరుగకుండ
నిండియుండున ? మరియట్లెనుండబోదు
కలిమినమ్మకు లేమితో గలసియుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 115

గీ॥ అడుగువడినిల్లు వాసయోగ్యంబుగాదు
ఆరద్రావెడివాని నెయ్యంబు వలదు
భాగ్య హీనుడు కనలుట వలదు వలదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 116

గీ॥ పులుపుతో పాలు, వెలయాలి వలన ఘనత,
మిరియ మదిచేర అరటియు విరుగు తెరగు
మిడిసి పాటును గల్గిన చెడును పేద
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 117

గీ॥ ఆడిచెడరోత; నెయ్యంబు వీడరోత;
రాచి వేచెడి బంధువు రాకరోత;
విత్తహీనుడు పల్కుటే వింతరోత;
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 118

గీ॥ బీదకప్పును, ఓటమి జూదరికిని,
బాలురకు వీపు మీదుంట, పామరునకు
ఓలగమునకు బోవుట నొప్పుగాదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 119

గీ॥ కట్టుగుడ్డల పయనించునట్టి పేద
వాని రక్షింప తోడేల వాని వెంట
బీదతనమను బెబ్బులి వెనుక నరుగ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 120

ತ್ರಿಪದಿ॥ ಸಾಲವನು ತರುವಾಗ ಹಾಲು ಬೋನುಂಡಂತೆ
ಸಾಲಿಗನು ಬಂದು ಕೇಳಿದರೆ, ಕುಂಡಿಗೆ
ಚೇಳುಕಡಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೨೧

ತ್ರಿಪದಿ॥ ಸಾಲವನು ಕೊಂಬಾಗ ಹಾಲು ಹಣ್ಣುಂಡಂತೆ
ಸಾಲಿಗನು ಬಂದು ಎಳೆದಾಗ ಕಿಬ್ಬದಿಯ
ಕೀಲು ಮುರಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೨೨

ತ್ರಿಪದಿ॥ ನಂಬುಗೆಯ ಇರುವನಕ ಕೊಂಬುವದು ಸಾಲವನು
ನಂಬುಗೆಯ ಕೆಟ್ಟಬಳಿಕ, ತಾ ಬೇಗೆಯಲಿ
ಬೆಂದು ಸತ್ತಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೨೩

ತ್ರಿಪದಿ॥ ಇದ್ದೂರ ಸಾಲ ಹೇಗಿದ್ದರೂ ಕೊಳಬೇಡ
ಇದ್ದುದನು ಸೆಳೆದು ಸಾಲ ಕೊಟ್ಟವ, ಗುದ್ದಿ
ಒದ್ದು ಕೇಳುವನು ಸರ್ವಜ್ಞ ೧೨೪

ತ್ರಿಪದಿ॥ ಬೇರೂರ ಸಾಲವನು ನೂರನಾದರು ಕೊಳ್ಳು
ಮೂರಾರು ವರ್ಷಕವ ಬಂದ ದಾರಿಯಲಿ
ಸಾರಿಹೋಗುವನು ಸರ್ವಜ್ಞ ೧೨೫

ತ್ರಿಪದಿ॥ ಹಾಲುಬೋನವು ಲೇಸು, ಮಾಲೆ ಕೊರಳಿಗೆ ಲೇಸು
ಸಾಲವಿಲ್ಲದನ ಮನೆಲೇಸು, ಬಾಲರಾ
ಲೀಲೆ ಲೇಸೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೨೬

తే॥ గీ॥ అన్నమును పాలుదిన్నట్లు అప్పుబడయ
అప్పులిచ్చిన యాతండు అడిగినపుడు
గుదము వాయంగ బరితేలు గుట్టినట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 121

తే॥ గీ॥ వలసి తానప్పుగొనునాడు, పాలుపండ్లు
తిన్నయట్లుండు, అప్పునిమ్మన్నయపుడు
అస్థికలు కీళ్ళు వ్రచ్చిన యట్టులుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 122

తే॥ గీ॥ నమ్మకంబును గల్గియున్నంత వరకు
అప్పు పుట్టును. నమ్మక మట్టె చెడిన
బాణలిని వేగి మడిసిన పగిదినుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 123

॥ గీ॥ అప్పు చేయగ స్వగ్రామ మనువు గాదు
అనువు గలిగియు చేయకు. మప్పువాడు
పట్టి పీడించు నిమ్మని గొట్టు, తన్ను,
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 124

॥ గీ॥ పొరుగు గ్రామాన నప్పులు పుట్టినపుడు
అప్పు దీర్చంగ సమయ మెంతైన కలుగు
వచ్చి పోవుచు వాడుండు భయము లేదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 125

॥ గీ॥ బాలురాటాడ జూచుట, పాలతోడ
అన్నముందింట, మాలగళాన నుంట
అప్పులేకుండగా నుంట మెప్పుగల్గు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 126

## ಸತ್ಯ - ನೀತಿ

ತ್ರಿಪದಿ॥ ಸತ್ಯರ ನುಡಿತೀರ್ಥ, ನಿತ್ಯರ ನಡೆತೀರ್ಥ,
ಉತ್ತಮರ ಸಂಗವದು ತೀರ್ಥ, ಹರಿವ
ನೀರೆತ್ತಣದು ತೀರ್ಥ ಸರ್ವಜ್ಞ ೧೨೭

ತ್ರಿಪದಿ॥ ಬತ್ತಿಎಣ್ಣೆಗಳೆರಡು ಹೊತ್ತಿಬೆಳಗುವ ರೀತಿ
ಸತ್ಯನೀತಿಗಳು ಬೆಳಗಿದವು, ಜೋಡಗಲೆ
ಕತ್ತಲೀ ಜಗವು ಸರ್ವಜ್ಞ ೧೨೮

ತ್ರಿಪದಿ॥ ಡೊಂಕು ಹಣ್ಣುಗಳಲ್ಲಿ ಡೊಂಕು ಬಾಳೆಯಹಣ್ಣು
ಡೊಂಕುಂಟು, ಒಳಗೆ ರುಚಿಯುಂಟು ಸಜ್ಜನರ
ಡೊಂಕು ಲೇಸೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೨೯

ತ್ರಿಪದಿ॥ ಹುಸಿಯ ಪೇಳ್ವುದರಿಂದ ಹಸಿದು ಸಾವುದು ಲೇಸು
ಹುಸಿದು ಮೆರೆಯುವನ ಬದುಕಿಂದ ಹಂದಿಯ
ಇಸಿಯು ಲೇಸೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೩೦

ತ್ರಿಪದಿ॥ ಹುಸಿವ ನಿಂದ್ಯೆನೂರು ಪಶುವ ಕೊಂದವ ಲೇಸು
ಸಿಶುವಧೆಯ ಮಾಡಿದವ ಲೇಸು ಮರೆಯಲಿ
ದ್ವೆಶದರೂ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೧೩೧

ತ್ರಿಪದಿ॥ ಸಜ್ಜನರ ಸಂಗವದು ಹೆಜ್ಜೇನು ಸವಿದಂತೆ
ದುರ್ಜನರ ಸಂಗದೊಡನಾಟ, ಬಚ್ಚಲಿನ
ರೊಚ್ಚಿನಂತಿಹುದು ಸರ್ವಜ್ಞ ೧೩೨

# సత్యము - నీతి

తే॥ గీ॥ సత్యనిత్యుల పల్కులు, సజ్జనాళి
దివ్య సాంగత్యగోష్ఠుల దీర్ఘమంద్రు
పారు నీరేటి తీర్థంబు పలికి చెప్ప
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 127

తే॥ గీ॥ వత్తి నూనెల జంటతో వచ్చు వెలుగు
నీతి సత్యాల జంటచే నెగడు వెలుగు
జంట విడిపోవ తిమిరమ్ము జగతి గ్రమ్ము
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 128

తే॥ గీ॥ ఫలము లందెల్ల వక్రమౌ, ఫలము కదళి
వంకరైనను రుచియుండు పక్వముండు
అరయ సుజనుల వంకర అరటి వోలె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 129

తే॥ గీ॥ అనృతమాడుచు మెరయు జీవనముకంటె
పస్తులంబడి ప్రాణమ్ము వదల లెస్స
ఆ బ్రతుకు కంటె మరి పందియైన లెస్స
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 130

తే॥ గీ॥ మహి నసత్యము పల్కెడు మనుజుకన్న
అయిదు వందల పశుగణ, హంత మిన్న
మరియు శిశుహంత, మాటు పోటరియు మిన్న
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 131

తే॥ గీ॥ సుగుణజన మైత్రి మధురిమంజుంటి తేనె
ఖలజనావళిమైత్రి దుర్గంధ మొదవు
కలుజు తూమున బారెడు జలములట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 132

ತ್ರಿಪದಿ|| ಬಲ್ಲವರ ಒಡನಾಟ ಬೆಲ್ಲವನು ಮೆದ್ದಂತೆ
ಅಲ್ಲದಹುದೆಂಬ ಅಜ್ಞಾನಿಯೊಡನಾಟ
ಕಲ್ಲುಹಾದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೩೩

ತ್ರಿಪದಿ|| ಮಾನಹೀನರ ಸಂಗ ಏನು ಕೊಟ್ಟರು ಬೇಡ
ಮಾನವುಳ್ಳವರ ಸಂಗ ತಾ ಸಕ್ಕರೆಯು
ಜೇನು ಸವಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೩೪

ತ್ರಿಪದಿ|| ಮುಟ್ಟಿದಂತಿರಬೇಕು ಮುಟ್ಟದಲೆ ಇರಬೇಕು
ಮುಟ್ಟಿಯು ಮುಟ್ಟದಿರಬೇಕು ಪರಸ್ತ್ರೀಯ
ಮುಟ್ಟಿದವ ಕೆಟ್ಟ ಸರ್ವಜ್ಞ ೧೩೫

ತ್ರಿಪದಿ|| ಒಡಲ ಹಿಡಿದಾಡದಿರು ನುಡಿಯ ಹೋಗಾಡದಿರು
ನಡೆಯೊಳೆಚ್ಚರವ ಬಿಡದಿರು, ಪರಸತಿಯ
ಕಡೆಗೆ ನೋಡದಿರು ಸರ್ವಜ್ಞ ೧೩೬

ತ್ರಿಪದಿ|| ಅನ್ಯಪುರುಷನ ಕಂಡು ತನ್ನ ಹಡೆದವನೆಂದು
ಮನ್ನಿಸಿ ನಡೆವ ಸತಿಯಳಿಗೆ ಸ್ವರ್ಗದೋಳ್
ಹೊನ್ನಿನಾ ಮನೆಯು ಸರ್ವಜ್ಞ ೧೩೭

ತ್ರಿಪದಿ|| ಜಾತಿ ಜಾತಿಗೆ ವೈರ, ನೀತಿ ಮೂರ್ಖಗೆ ವೈರ
ಪಾತಕವು ವೈರ ಸುಜನರ್ಗೆ, ಅರಿದಂಗೆ
ಪಿತರದು ವೈರ ಸರ್ವಜ್ಞ ೧೩೮

తే॥ గీ॥ ఉన్నతుల చెల్మి బెల్లము దిన్నయట్లు
కానిదగునని వాదించు వాని చెలిమి
త్వరితగతి తోడ శిలయు తా దవిలినట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 133

తే॥ గీ॥ మాన హీనులతో మైత్రి మానవలయు
వారలే మీాయ చేకొనవలదు, మాన
ధను చెలిమి చక్కెరయు తేనె దినినయట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 134

తే॥ గీ॥ తాకినను నుండవలె మరితాకనట్లు
వలచి తావచ్చినను కూడ వలదు సుమ్మి
తాకబోకుము పరకాంత దాకజేటు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 135

తే॥ గీ॥ అలసుడవుగాకు, మరి కల్లలాడ బోకు;
చారు శీలమునందు హెచ్చరిక విడకు;
అన్యకాంతల జూడ నారాట పడకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 136

తే॥ గీ॥ పరుని తనకన్నతండ్రిగా భావమునను
తలచి మన్నన వర్తించు తన్వికెపుడు
స్వర్ణ నిలయంబు సిద్ధమౌ స్వర్గమందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 137

తే॥ గీ॥ జాతి జాతికి, ఖలునకు నీతి, పుణ్య
కర్మలకు పాతకము కంటకమ్మగును
జ్ఞాని కేనాడు లేదుపో కంటకంబు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 138

ತ್ರಿಪದಿ|| ಧನಕನಕ ವುಳ್ಳನಕ ದಿನಕರನವ್ರೋಲಕ್ಕು
ಧನಕನಕ ಹೋದ ಮರುದಿನ ಹಾಳೂರ
ಶುನಕನಂತಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೧೩೯

ತ್ರಿಪದಿ|| ಮಡದಿ ಮಕ್ಕಳ ಮಮತೆ ಒಡಲೊಡೆವೆ ಇರುತನಕ
ಒಡಲೊಡೆವೆ ಕೆಡಲು ಮರುದಿನ ಅವರೆಲ್ಲ
ಕಡೆಗೆ ಸಾರಿಹರು ಸರ್ವಜ್ಞ ೧೪೦

ತ್ರಿಪದಿ|| ಮುನಿವಂಗೆ ಮುನಿಯದಿರು ಕಿನಿವಂಗೆ ಕಿನಿಯದಿರು
ಮನಸಿಜಾರಿಯನು ಮರೆಯದಿರು ಶಿವಕೃಪೆಯು
ಘನಕೆ ಘನವಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೧೪೧

ತ್ರಿಪದಿ|| ಆರೈದು ನುಡಿವವನು ಆರೈದು ನಡೆವವನು
ಆರೈದು ಪದವನಿಡುವವನು ಲೋಕಕ್ಕೆ
ಆರಾಧ್ಯ ನಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೧೪೨

ತ್ರಿಪದಿ|| ಕಂಡದನು ಆಡೆ ಭೂಮಂಡಲವು ಕಿನಿಯುವುದು
ಕೊಂಡಾಡುತಿಚ್ಛೆ ನುಡಿದಿಹರೆ ಜಗವೆಲ್ಲ
ಮುಂದಾಡುತಿಹುದು ಸರ್ವಜ್ಞ ೧೪೩

ತ್ರಿಪದಿ|| ಉಳ್ಳವನು ನುಡಿದಿಹರೆ ಒಳ್ಳಿತೆಂದನ್ನುವರು
ಇಲ್ಲದ ಬಡವನುಡಿದಿಹರೆ, ತುತ್ತಿಟ್ಟು
ಕಲ್ಲು ಕಡಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೧೪೪

తే॥ గీ॥ కనక ధనములు గల్గ తిజ్మాంశుడగును
అవియు నూడిన మరునాడు నాతడగును
సొంపు జెడినూరదిరిగెడి శునకమట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 139

తే॥ గీ॥ ఆలుబిడ్డల యనురాగ మలరుటెల్ల
ఒడలు, తొడవుల మురిపెమ్ము నుండువరకె
గడగి నవియూడ మరునాడు కానివారె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 140

తే॥ గీ॥ విసుగు కొనియెడి వారిపై విసుగుకొనకు
కోపగించెడి వారిపై కోపపడకు
హరుని మరువకు కడుదయాపరుడతండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 141

తే॥ గీ॥ అరసి పల్కునతడు, నడతెరుగు నతడు,
ఎరుక మనుగడ సాధింప నెరుగునతడు
మిగుల నారాధ్యుడయ్యెల మెరయుజూవె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 142

తే॥ గీ॥ ఉన్నదున్నటు లాడగా నుర్విలోన
నెగసి గినియుదు, రనువుగా పొగడుచున్న
జగము మెచ్చుచు నాట్యమ్ము సలుపునెదుట
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 143

తే॥ గీ॥ కలిమిగల వారలాడిన పలుకు మిన్న
పేదపలుకాడ పసగాదు వినుటకెపుడు
కబళముందించు చిరురాయి గరచినట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 144

ತ್ರಿಪದಿ॥ ಹೆಣ್ಣನ್ನು ಹೊನ್ನನ್ನು ಹಣ್ಣಾದ ಮರಗಳನು
ಕಣ್ಣಿನಲಿ ಕಂಡು ಮನದಲ್ಲಿ ಬಯಸದಿಹ
ಅಣ್ಣಗಳು ಯಾರು ಸರ್ವಜ್ಞ ೧೪೫

ತ್ರಿಪದಿ॥ ವಚನದೊಳ ಗೆಲ್ಲವರು ಶುಚಿ ವೀರ ಸಾಧುಗಳು
ಕುಚ ಶಸ್ತ್ರ ಹೇಮ ಸೋಂಕಿದರೆ ಲೋಕದೊಳ
ಗಚಲದವರಾರು ಸರ್ವಜ್ಞ ೧೪೬

ತ್ರಿಪದಿ॥ ಎಲ್ಲವರು ಹಿರಿಯವರು ಬಲ್ಲವರು ಗರುವರರು
ನಲ್ಲಳುರೆ ಮುಂದೆ ಸುಳಿದರೆ ಲೋಕದೊಳ
ಗೊಲ್ಲದವರಾರು ಸರ್ವಜ್ಞ ೧೪೭

ತ್ರಿಪದಿ॥ ಯತಿಗಳಿಗೆ ಮತಿ ಕೆಡುಗು, ಸತಿಯ ಸಜ್ಜನ ಕೆಡಗು
ಸ್ಥಿತಿವಂತರಿದ್ದು ಭ್ರಮೆಗೊಳಗು ಹೊನ್ನೆಂಬ
ಶ್ರುತಿಯ ಕೇಳಿದರೆ ಸರ್ವಜ್ಞ ೧೪೮

ತ್ರಿಪದಿ॥ ಮೆರೆಸುವುದು ಅನ್ಯರನು, ಮರೆಸುವುದು ತನ್ನವರ
ಇರಿಸುವುದು ತನ್ನ ಇದಿರನು ಹೊನ್ನಿನ
ತರವ ನೊಡೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೪೯

ತ್ರಿಪದಿ॥ ಹೆಣ್ಣಿಗೂ ಮಣ್ಣಿಗೂ ಉಣ್ಣಾದುರಿಯಲು ಬೇಡ
ಹೆಣ್ಣಿಂದ ಕೆಟ್ಟ, ದಶಕಂಠ, ಕೌರವನು
ಮಣ್ಣಿಂದ ಕೆಟ್ಟ, ಸರ್ವಜ್ಞ ೧೫೦



తే॥ గీ॥ వెలది, యపరంజి. ఫలభార వృక్షవితతి
కన్నులంగాంచి మనసున కాంక్షపడని
వన్నెవాసియు గల్గిన అన్నలెవరు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 145

తే॥ గీ॥ పలికెదరు సాధు, శుచి, వీర వరులయట్లు
స్వర్ణ, కుచ, శస్త్రములుసోక, చలనరహిత
చిత్తులెవ్వారు గానంగ క్షితినిగలరె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 146

తే॥ గీ॥ మాననీయులు పెద్దలు జ్ఞానులైన
మందగమనలు చనుగుబ్బలందమొలుక
వలచివచ్చిన వలదను వారుకలరె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 147

తే॥ గీ॥ యతులకు మతిచెడును, గుణమతివచెడును
బహుళ సంపద తులతూగు వారలైన
భ్రమకు లోనౌదురిలయందు పైడియనిన
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 148

తే॥ గీ॥ వైభవంబున మెరపించు పరులనైన !
మరువజేయును తనవారి మమతనైన !
వైరిజంపించు గనుమ బంగారుగరిమ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 149

తే॥ గీ॥ వనిత, వసుమతి కొరకునై పగయు వలదు
రాము వనితకునై జచ్చె రావణుండు
రాజ్యమాశించి కలన రారాజు మడిసె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 150

ತ್ರಿಪದಿ॥ ಕಣ್ಣಿನಿಂದಲೆ ಪುಣ್ಯ ಕಣ್ಣಿನಿಂದಲೆ ಪಾಪ
ಕಣ್ಣಿನಿಂದಿಹವು ಪರವಕ್ಕು ಲೋಕಕ್ಕೆ
ಕಣ್ಣೆ ಕಾರಣವು ಸರ್ವಜ್ಞ ೧೫೧

ತ್ರಿಪದಿ॥ ಕಣ್ಣು ನಾಲಿಗೆ ಮನವು ತನ್ನದೆಂದೆನ ಬೇಡ
ಅನ್ಯರು ಕೊಂದರೆನಬೇಡ, ಇವು ಮೂರು
ತನ್ನನೇ ಕೊಲುಗು ಸರ್ವಜ್ಞ ೧೫೨

ತ್ರಿಪದಿ॥ ಕತ್ತಿಲಾದಾಗಾಯ ಮತ್ತಿರದೆ ಮಾಯುವುದು
ಸುತ್ತಲಾಡುತಿಹ ಜಿಹ್ವೆಯ ಗಾಯವು
ನಿತ್ಯಕೂ ಬಿಡದು ಸರ್ವಜ್ಞ ೧೫೩

ತ್ರಿಪದಿ॥ ಭೂಪತಿಗೆ ದಳಲೇಸು, ಆಪತ್ತಿಗಣಲೇಸು
ಕೋಪವನು ಕಳೆದ ಸತಿ ಲೇಸು, ಶಿಶುವಿಗೆ
ಜೋಪಾನ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೧೫೪

ತ್ರಿಪದಿ॥ ನೀಚಜನ ನೆರೆಯಿಂದ ಈಚಲದ ಮರಲೇಸು
ಈಚಲೊಂದೆಡಿಗೆ ಉಪಕಾರಿ ನೀಚತಾ
ಈಚಲಿಂಕಷ್ಟ, ಸರ್ವಜ್ಞ ೧೫೫

ತ್ರಿಪದಿ॥ ಮದ್ಯಪಾನವ ಮಾಡಿ ಇದ್ದುದೆಲ್ಲವ ನೀಗಿ
ಬಿದ್ದುಬರುವವನ ಸಂಸಾರ ಸದ್ದಡಗಿ
ಎದ್ದು ಹೋಗುವುದು ಸರ್ವಜ್ಞ ೧೫೬

తే॥ గీ॥ కలుగు పుణ్యపాపమ్ములు కంటిచేత
దనరు నిహపర సాధన దానివలన
కన్నె యీలోకమున కెల్ల కారణమ్మ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 151

తే॥ గీ॥ కనులు నాలుక మనసులు తనవియనకు
అన్యులే తన్ను జంపెద రనగవలదు
తన్నుగడతేర్చు నీ మూడు తథ్యముగను
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 152

తే॥ గీ॥ మాను కరవాలు గాయమ్మ గానబడక
గ్రమ్మకొని నిందలాడెడి గరకు నాల్క
గాయమనిశంబు గారించి గాసిబెట్టు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 153

తే॥ గీ॥ భూమిపతులకు సైన్యంబు పొసగలెస్స
దవులునాపద వారింప ధనములెస్స
అలుక నెరుగని ఇల్లాలి వలపు లెస్స
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 154

తే॥ గీ॥ ఘాతు కాశ్రయమునకన్న నీత లెస్స
ఎట్లొ మేలిచ్చు నెంతైన నీత చెట్టు
ఈతతో పోల్చగా నీచుడెట్లు తగును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 155

తే॥ గీ॥ కల్లు సారాయికై యిల్లు గుల్లజేసి
పడుచు లేచుచు నింటికి వచ్చువాని
విడిచి సంసార మెటకైన వెళ్ళుజూవె!
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 156

ತ್ರಿಪದಿ|| ಅಂಗಿಯರಿಪೆಯ ಮಾರಿ ಭಂಗಿಯನು ತಾ ಸೇದಿ
ಮಂಗನಂದದಿ ಕುಣಿವಾತ ಭವಭವದಿ
ಭಂಗಗೊಳುತಿಹನು ಸರ್ವಜ್ಞ ೧೫೭

ತ್ರಿಪದಿ|| ಗಾಳಿ ಧೂಳಿಯ ದಿನಕೆ ಮಾಳಿಗೆಯಮನೆ ಲೇಸು
ಹೋಳಿಗೆ ತುಪ್ಪ ಉಣಲೇಸು ಬಾಯಿಗೆ
ವೀಳೆಯವು ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೧೫೮

ತ್ರಿಪದಿ|| ನೆತ್ತವೂ ಕುತ್ತವೂ ಹತ್ತಿದೊಡೆ ಅಳವಲ್ಲ
ಕುತ್ತದಿಂ ದೇಹ ಬಡವಕ್ಕು, ನೆತ್ತದಿಂ
ಬತ್ತಲೆಯು ಅಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೧೫೯

ತ್ರಿಪದಿ|| ಆಡಿ ನಲನೃಪಕೆಟ್ಟ, ಆಡಿ ಧರ್ಮಜಕೆಟ್ಟ
ನೋಡಿದ ನಾಲ್ವರು ತಿರಿದುಣಲು, ನೆತ್ತವನು
ಆಡಬೇಡೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೬೦

ತ್ರಿಪದಿ|| ಆಡಿದವರಿದ್ದಂತೆ ನೋಡಿದವ ತಾಕೆಟ್ಟ
ಬೇಡುವವಕೆಟ್ಟ, ನೆತ್ತವನು ಆಡುವರ
ಕೂಡಿದವ ಕೆಟ್ಟ, ಸರ್ವಜ್ಞ ೧೬೧

ತ್ರಿಪದಿ|| ನೆತ್ತವನು ಒಳಿತೆಂದು ನಿತ್ಯವಾಡಲು ಬೇಡ
ನೆತ್ತದಿಂ ಕುತ್ತು ಮುತ್ತಿಬರೆ ಸುತ್ತರಿದು
ಕತ್ತಲಾಗುವದು ಸರ್ವಜ್ಞ ೧೬೨

గీ॥ కట్టు బట్టమ్ముకొని. భంగు పట్టుబట్టి
కోతివలె గెంతువానిది కోతి బ్రతుకె
శవము భవమున కైనను బాగుపడడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 157

గీ॥ గాలి హోరున దుమ్మెత్తు కాలమందు
భవనమది లెస్స ! ఘృతముతో భక్ష్యములను
గుడువమరి లెస్స ! నోటికి విడెము లెస్స
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 158

గీ॥ వ్యాధి జూదము మనుజుని నంటవిడవు
వ్యాధిదేహము స్రుక్కించు బాధపెట్టు
జూదమాతని సర్వంబు చూరగొనును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 159

గీ॥ ఆడి నలరాజు ధర్మజుడోడి చెడిరి
చూచి నల్వురు తిరిపెమ్ము నోచుకొనిరి
వలదు జూదము ఆడంగ వచ్చుచేటు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 160

గీ॥ జూదరుల వోలె, జూదంబు జూచువారు
జూచువారల వెంటేగు చుండువారు
భంగపడుదురు జూదంబు వలదు వలదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 161

గీ॥ ఆడుటయె సుఖమని నిచ్చలాడవలదు
జూదమున రోగములు తన్నుజుట్టుముట్ట
నపుడు చీకట్లు అంతట నలముకొనును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 162

ತ್ರಿಪದಿ॥ ಬಲವಂತನಾನೆಂದು ಬಲಿದು ಹೋರಲು ಬೇಡ
ಬಲವಂತ ವಾಲಿ ಶ್ರೀರಾಮನೊಡನಾಡಿ
ಚಲದಿಂದ ಕೆಟ್ಟ, ಸರ್ವಜ್ಞ ೧೬೩

ತ್ರಿಪದಿ॥ ವಿದ್ಯಕ್ಕೆ ಕಡೆಯಿಲ್ಲ ಬುದ್ಧಿಗೆ ಬೆಲೆಯಿಲ್ಲ
ಛಿದ್ರಿಸುವವಗೆ ಗತಿಯಿಲ್ಲ, ಮರಣಕ್ಕೆ
ಮದ್ದು ತಾನಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೬೪

ತ್ರಿಪದಿ॥ ವಿದ್ಯೆಯುಳ್ಳನ ಮುಖವು ಮುದ್ದು ಬರುವಂತಿಕ್ಕು
ವಿದ್ಯೆಯಿಲ್ಲದನಬರಿ ಮುಖವು ಹಾಳೂರ
ಹದ್ದಿನಂತಿಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೧೬೫

ತ್ರಿಪದಿ॥ ವಿದ್ಯವೇ ತಾಯ್ತಂದೆ, ಬುದ್ಧಿಯೇ ಸೋದರನು
ಅದ್ವಾನಕಾದರವ ನೆಂಟ ಸುಖದಿ ತಾ–
–ನಿದ್ದುದೇ ರಾಜ್ಯ ಸರ್ವಜ್ಞ ೧೬೬

ತ್ರಿಪದಿ॥ ಇದ್ದಲ್ಲಿ ಸಲುವ ಹೋಗಿದ್ದಲ್ಲಿಯೂ ಸಲುವ
ವಿದ್ಯಯ ಕಲಿತ ಬಡವ ತಾ ಗಿರಿಯ ಮೇ–
–ಲಿದ್ದರೂ ಸಲುವ ಸರ್ವಜ್ಞ ೧೬೩

ತ್ರಿಪದಿ॥ ವನಕೆ ಕೋಗಿಲೆ ಲೇಸು, ಮನಕೆ ಹರುಷವು ಲೇಸು
ಕನಕವುಳ್ಳವನಕಳೆ ಲೇಸು ವಿದ್ಯಕ್ಕೆ
ವಿನಯವೇ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೧೬೮

తే॥ గీ॥ బలము గలవాడనేనని బలిమిజూప
గర్వపడకుము వాలితా గర్వియగుచు
పోరజని రాముబాణాగ్ని పొలిసెగాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 163

తే॥ గీ॥ విద్య కంతము, బుద్ధికి వెలయు లేదు
భేదబుద్ధికి సుగతి పెంపెసగలేదు
మరణమాసన్నమైనచో మందులేదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 164

తే॥ గీ॥ విద్దె కలవాని మోమది ముద్దువచ్చు
విద్య నెరుగని నరుమోము వెల్ల నౌచు
పాడుబడినూర పెన్గ్రుద్ద పగిదినుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 165

తే॥ గీ॥ విద్య తలిదండ్రి బుద్ధి తాపెద్ద యన్న
ఆర్తి నాశ్రయ మిడువాడె ఆత్మబంధు
తాను సుఖమున్నదే రాజ్యమౌనుగాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 166

తే॥ గీ॥ ఇచట, తాబోవుచోట, మరెచటనైన
కోనలందున్న కొండల కొసల నున్న
విద్య పోషించు నేర్చిన, బీదవాని
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 167

తే॥ గీ॥ వనికి పికము, హర్షము మనసునకు లెస్స !
కలిమిగలవానితో చెల్మి గలుగ లెస్స !
వినయమది లెస్స విద్యకు విశ్వమందు !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 168

ತ್ರಿಪದಿ॥ ಉದ್ಯೋಗವುಳ್ಳವನ ಹೊದ್ದುವುದು ಸಿರಿಬಂದು
ಉದ್ಯೋಗವಿಲ್ಲದಿರುವವನ ಕರದೊಳಗೆ
ಇದ್ದುದೂ ಪೋಕು ಸರ್ವಜ್ಞ ೧೬೯

ತ್ರಿಪದಿ॥ ಹೋರುವ ಸತಿಯಿಂದ ಸೋರುವ ಮನೆಯಿಂದ
ಪೂರೈಸದನ ಬದುಕಿಂದ ಕೊಂಡೊಯ್ಯು
ಮಾರಿ ಲೇಸೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೭೦

ತ್ರಿಪದಿ॥ ಬೆರೆವಂಗೆ ಭೋಗವು ಮೊರೆವಂಗೆ ರಾಗವು
ಬರೆವಂಗೆ ಓದುಬರುವಂತೆ ಸಾಧಿಪಗೆ
ಬಾರದಿಹುದುಂಟೆ ಸರ್ವಜ್ಞ ೧೭೧

ತ್ರಿಪದಿ॥ ಆಯೆಂದು ಅಳುಗೂಸು ಜೋಯೆಂದು ತೂಗಿದರೆ
ತಾಯಿ ಹಂಬಲವ ಮರೆಸುವುದು ಶಿಶುಗಾನ-
-ದಾಯತವ ನೋಡ ಸರ್ವಜ್ಞ ೧೭೨

ತ್ರಿಪದಿ॥ ಬಾಜಿಯ ಹೂಲೇಸು ತೇಜಿವಾಹನ ಲೇಸು
ರಾಜಮಂದಿರದೊಳಿರಲೇಸು, ತಪ್ಪುಗಳ
ಮಾಜುವದೆ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೧೭೩

ತ್ರಿಪದಿ॥ ಮಲ್ಲಿಗೆಯ ಹೂಲೇಸು ಬಲ್ಲವರ ಕಳೆಲೇಸು
ನಿಲ್ಲದೆ ಕರೆವ ಹಸುಲೇಸು ಕೂರ್ಪವಳ
ಸೊಲ್ಲು ಲೇಸೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೭೪

తే॥ గీ॥ ప్రకటయుద్యోగ భోగియై బరగువాని
వలచి సిరివచ్చు, నుద్యోగ భంగమైన
నున్న ధనమును చేజారి యూడిపోవు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 169

తే॥ గీ॥ కారెడిలుకన్న, పోరెడి కాంతకన్న
బ్రతుకు పండక వెతగుందు బ్రతుకుకన్న
మరణమావాహనము జేయు మారిమిన్న
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 170

తే॥ గీ॥ ఇచ్చు వానికి భోగము, నిచ్చు పొడ
వచ్చు రాగము, చదువు దా వ్రాయవచ్చు,
సాధ్యమేదైన నీ రీతి సాధకునకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 171

తే॥ గీ॥ ఆయనుచు పాపయేడ్వగ జోయటంచు
పాడ నిదురించు తల్లి సంబరము మరచి
జోయనెడి నాద సుధహేల సొంపుగనుమ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 172

తే॥ గీ॥ జాజిపూలెస్స పయనించ వాజి లెస్స !
రాజమందిర వాసంబు రాణ లెస్స !
తప్పు లెంచక నుండుట తగిన లెస్స !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 173

తే॥ గీ॥ మాన్య బుధమైత్రి యగు లెస్స, మల్లె లెస్స !
పాడి తప్పక గూర్చెడి పసియు లెస్స !
వలపు ప్రియురాలు పలికెడి పలుకు లెస్స !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 174

ತ್ರಿಪದಿ|| ದಂತಪಂಕ್ತಿಯ ನಡುವೆ ಎಂತಿರ್ಪುದದು ಜಿಹ್ವೆ
ಅಂತುದುರ್ಜನರ ಒಳಸಿನಲಿ ಸಜ್ಜನನು
ನಿಂತಿಹನು ನೋಡ ಸರ್ವಜ್ಞ ೧೭೫

ತ್ರಿಪದಿ|| ಒಳ್ಳಿದರ ನೊಡನಾಡಿ ಕಳ್ಳನೊಳ್ಳಿದ ನಕ್ಕು
ಒಳ್ಳಿದನು ಕಳ್ಳರೊಡನಾಡಿ ಅವಶುದ್ಧ
ಕಳ್ಳತಾನಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೧೭೬

ತ್ರಿಪದಿ|| ಬರೆಕಂಡು ಕರೆಯದನ ಇರೆಕುಳ್ಳಿರೆನ್ನದನ
ಸರಸ ಸಜ್ಜನಿಕೆ ಇಲ್ಲದನ ಸಖಿತನವ
ಬೆರಸಲೇ ಬೇಡ ಸರ್ವಜ್ಞ ೧೭೭

ತ್ರಿಪದಿ|| ಮರುಳ ತಾ ಮಳೆಗಂಜಿ ಮರದಡಿಯ ಸಾರಿದರೆ
ಮರದ ಹನಿಬಿಡದು ಮಳೆನಿಂತು ದುರುಳರ
ನೆರೆಯು ಇಂತೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೭೮

ತ್ರಿಪದಿ|| ಜ್ಞಾನಿಗೆ ಗುಣಲೇಸು ಮಾನಿನಿಗೆ ಪತಿಲೇಸು
ಸ್ವಾನುಭಾವಿಗಳ ನುಡಿಲೇಸು, ಎಲ್ಲಕ್ಕು ನಿ-
ಧಾನಿಯೇ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೧೭೯

ತ್ರಿಪದಿ|| ಜಾಣೆಯ ನುಡಿಲೇಸು ವೀಣೆಯ ಸ್ವರಲೇಸು
ಮಾಣದಲೆ ವದನಶುಚಿಲೇಸು, ಕೂರ್ಪವರ
ಕಾಣುವದೆಲೇಸು ಸರ್ವಜ್ಞ ೧೮೦

గీ॥ చుట్టు క్రొవ్వాడి దంతముల్ ముట్టడింప
నడుమ నాలుక నొవ్వక నడగు కరణి
జగడ దుర్జాతి నడుమ సజ్జనుడుమెలగు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 175

గీ॥ సుగుణులను జేర చోరుండు సుగుణియగును
చోరులను జేర సుగుణియు చోరుడగును
స్థాన సంఘాల సంగతి సాగు నిట్లు !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 176

గీ॥ వచ్చుటను జూచి పిల్వని వాని, చూచి
కూర్చొనుము రమ్మని పలుక కుండువాని,
మంచి నెరుగని జనుచెల్మి మానవలయు ;
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 177

గీ॥ వానకుంజంకి ఎడ్డె తాౖమాను జేర
వాన వెలిసిన విడువదాౖమాని చినుకు
కుత్సితాౖశయ మిబ్బంగి గోడుపెట్టు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 178

గీ॥ జ్ఞానికి సుగుణమదిలెస్స ! మానవతికి
పతియు లెస్స ! స్వానుభావుల వాక్కు లెస్స !
పరగ నన్నింట శాంతమ్ము బహుళ లెస్స !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 179

గీ॥ వాద్యరవళుల వల్లకీ స్వనము లెస్స !
నేర్పుగలవాని పలుకుల నీటు లెస్స !
వదన శుచి లెస్స ! సఖులతో నొదుగ లెస్స !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 180

# ಒಕ್ಕಲುತನ

ತ್ರಿಪದಿ॥ ಕೋಟಿ ವಿದ್ಯೆಗಳಲ್ಲಿ ಮೇಟಿ ವಿದ್ಯವು ಲೇಸು
ಮೇಟಿಯಿಂ ರಾಟ ನಡೆದುದಲ್ಲದೆ, ದೇಶ
ದಾಟವೇ ಕೆಡಗು ಸರ್ವಜ್ಞ ೧೮೧

ತ್ರಿಪದಿ॥ ಉತ್ತೊಮ್ಮೆ ಹರಗದಲೆ ಬಿತ್ತೊಮ್ಮೆ ನೋಡದಲೆ
ಹೊತ್ತೇರಿ ಹೊಲಕೆ ಹೋದರೆ ಅವತನ್ನ
ನೆತ್ತರವ ಸುಡುವ ಸರ್ವಜ್ಞ ೧೮೨

ತ್ರಿಪದಿ॥ ನಲ್ಲೆತ್ತಿನಾಬಂಡಿ ಬಲವಿಲ್ಲದಾರಂಭ
ಕಲ್ಲುಕಸಗಳನು ಬಿಟ್ಟಾತ ಹೊಲದೊಳಗೆ
ಹುಲ್ಲನೇ ಬೆಳೆವ ಸರ್ವಜ್ಞ ೧೮೩

ತ್ರಿಪದಿ॥ ಹದಬೆದೆಯಲಾರಂಭ ಕದನದಲಿ ಕೋರಂಬ
ನದಿಹಾಯುವಲ್ಲಿ ಹರಗೋಲು, ಮರೆತಾತ
ವಿಧಿಯ ಬೈದೇಸು ಸರ್ವಜ್ಞ ೧೮೪

ತ್ರಿಪದಿ॥ ಕಾಲದೊಳು ಮಳೆಗಾಲ ಮಾಲೆಯೊಳು ಮಲ್ಲಿಗೆಯು
ಕಾಲವಾರರಲಿ ಕಡುಚೆಲುವ ಬೇಸಿಗೆಯ
ಕಾಲವೇ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೧೮೫

ತ್ರಿಪದಿ॥ ಅಂಗನೆಯು ಗುಣಿಯಾಗಿ ಅಂಗಳದಿ ಹೊರಸಾಗಿ
ತಂಗಾಳಿ ಜೊನ್ನದಿರುಳಾಗಿ ಬೇಸಿಗೆಯು
ಹಿಂಗದೇ ಇರಲಿ ಸರ್ವಜ್ಞ ೧೮೬

# వ్యవసాయము

తే॥ గీ॥ కోటి విద్యల మేటి నాగేటి విద్య !
రక్తి నాగేటి కఱ్ఱాడ, రాట్నమాడ
దేశమే మించు. లేకున్న గాశి చెందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 181

తే॥ గీ॥ మెత్తగొకసారి దున్నక, విత్తు విత్తి
దానినొక సారిజూడక, తగని ప్రొద్దు
పొలమునకు నేగు రైతున్న ఫలముగనడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 182

తే॥ గీ॥ క్రొత్తదగుబండి బలమైన గిత్తలేక
రాయి రప్పలు తుప్పలు దీయకున్న
పొలము బీడగు రైతన్న ఫలము గనడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 183

తే॥ గీ॥ తొలకరిని కృషి, కవచంబు కలన మరచి,
నదిని దాటుట కైవచ్చి నౌక మరచి,
విధిని దూరిన ఫలమేమి విధుల మరచి;
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 184

తే॥ గీ॥ ఋతువులారింట వర్షంపు ఋతువుమిన్న !
మాలలందెన్నగా మల్లెమాల మిన్న !
కాలములయందు వేసవి చాలమిన్న !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 185

తే॥ గీ॥ మగువ గుణియౌచు ముంగిటమంచమౌచు
చలువ వెన్నెల నెలతేడు చెలగురేయి
మీఱినిల్చిన వేసవి మేలుగాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 186

# ಮೂರ್ಖ

ತ್ರಿಪದಿ|| ಮೂರ್ಖಂಗೆ ಬುದ್ಧಿಯನು ನೂರ್ಕಾಲ ಪೇಳಿದರೆ
ಗೋರ್ಕಲ್ಲ ಮೇಲೆ ಮಳೆಹುಯಿದ ರಾಕಲ್ಲು
ಹೀರ್ಕೊಂಬುದುಂಟೆ ಸರ್ವಜ್ಞ ೧೮೭

ತ್ರಿಪದಿ|| ಆರುಬೆಟ್ಟಗಳೊಬ್ಬ ಹಾರಬಹುದೆಂದಿಹರೆ
ಹಾರಬಹುದೆಂದು ಎನಬೇಕು, ಮೂರ್ಖನೊಳು
ಹೋರಟೆಯೆ ಸಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೮೮

ತ್ರಿಪದಿ|| ಮೊಲ ನಾಯಿ ಬೆನ್ನಟ್ಟಿ, ಗೆಲಬಹುದು ಎಂದಿಹರೆ
ಗೆಲಬಹುದೆಂದು ಎನಬೇಕು ಮೂರ್ಖನಲಿ
ಕಲಹ ಬೇಡೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೮೯

ತ್ರಿಪದಿ|| ನೆಲವನ್ನು ಮುಗಿಲನ್ನು ಹೊಲಿವರುಂಟೆಂದರವ
ಹೊಲಿವರು ಹೊಲಿವರೆನಬೇಕು ಮೂರ್ಖನಲಿ
ಕಲಹ ಬೇಡೆಂದ ಸರ್ವಜ್ಞ ೧೯೦

ತ್ರಿಪದಿ|| ಹೊಳೆಯ ನೀರೊಬ್ಬನೇ ಅಳೆಯಬಹುದೆಂದರವ
ಅಳೆಯಬಹುದೆಂದು ಎನಬೇಕು ಮೂರ್ಖನ
ಕಳೆಯಲಳವಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೯೧

ತ್ರಿಪದಿ|| ಹೊಲ್ಲಹನು ಒಳ್ಳಿದನು ಎಲ್ಲ ಠಾವಿನೊಳುಂಟು
ಹೊಲ್ಲಹನ ಹೊಲ್ಲನೆನಬೇಡ ಮೂರ್ಖ ತಾ–
–ನೆಲ್ಲರಲಿಹೊಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೯೨

# మూర్ఖుడు

తే॥ గీ॥ కడగి మూర్ఖుని మార్చుట కష్టతరము
వందమారులు బోధింప పొందుగాదు
వానదడిసిన గుండ్రాయి నానుటగునె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 187

తే॥ గీ॥ ఆరుకొండల లంఘించు వారకొకడు
అన్న నవలీల లంఘించు ననగవలయు
మూర్ఖు పలుకుల కెదురాడ మూర్ఖతౌను
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 188

తే॥ గీ॥ ఉరిమి కుందేలు శునకము నుక్కడంచు
ననుచు మూర్ఖుండు పలుక నౌననగవలయు
వలదు కలహంబు కాదని పలుకవలదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 189

తే॥ గీ॥ నింగి నేలను గుట్టెడి నేర్పరులును.
కలరు కలరన్న కలరని పలుకవలయు !
వాదమేటికి మూర్ఖుతో వలదు వలదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 190

తే॥ గీ॥ పాఱునీటిని యొక్కరుండేక ధాటి
గొలుచునంచన నౌనని పలుకవలయు
వాదమేటికి మూర్ఖుతో వలదు వలదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 191

తే॥ గీ॥ ఉందురెండైన నీచులు నుత్తములును !
నింద చేయకు నీచుని నీచుడనుచు
నీచతముడౌను మూర్ఖుండు నిశ్చయముగ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 192

# ಹೆಣ್ಣು

ತ್ರಿಪದಿ॥ ಹೆಣ್ಣಿನಿಂದಲೆ ಇಹವು ಹೆಣ್ಣಿನಿಂದಲೆ ಪರವು
ಹೆಣ್ಣಿನಿಂದಲೆ ಸಕಲ ಸಂಪದವು ಹೆಣ್ಣೊಲ್ಲ-
-ದಣ್ಣಗಳು ಯಾರು ಸರ್ವಜ್ಞ ೧೯೩

ತ್ರಿಪದಿ॥ ಮಗಳಕ್ಕ ತಂಗಿಯು ಮಿಗೆ ಸೊಸೆಯು ನಾದಿನಿಯು
ಜಗದ ವನಿತೆಯರು ಜನನಿಯು ಇವರೊಳಗೆ
ಜಗಕೊಬ್ಬಳೈಸೆ ಸರ್ವಜ್ಞ ೧೯೪

ತ್ರಿಪದಿ॥ ನಲ್ಲೆಯನು ಒಲ್ಲೆಂಬ ಸೊಲ್ಲುನಾಲಿಗೆ ಹೊಲೆಯು
ಬಲ್ಲಿದನು ಶ್ರವಣ ಸನ್ಯಾಸಿ ಇವರುಗಳು
ಎಲ್ಲಿವುದಿಸಿದರು ಸರ್ವಜ್ಞ ೧೯೫

ತ್ರಿಪದಿ॥ ಹರಿಜನರು ಮೊದಲಾಗಿ ನರಮನುಜ ಕಡೆಯಾಗಿ
ವರಯೋಗಿ ನಡುವೆ ತಾನಾಗಿ, ಮಾಯೆಗೆ
ಹೊರಗಾದರಾರು ಸರ್ವಜ್ಞ ೧೯೬

ತ್ರಿಪದಿ॥ ಮಾಯೆಗೆದ್ದಿಹಸೊಲ್ಲು ಬಾಯಿ ಮಾತಲ್ಲವೇ
ಮಾಯೆಯಿಂಕಾಯವಾಗಿರಲು, ನರಮನುಜ
ಮಾಯೆ ಗೆಲಲುಂಟೆ ಸರ್ವಜ್ಞ ೧೯೭

ತ್ರಿಪದಿ॥ ನೋಡಿದರೆ ಎರಡೂರು ಕೂಡಿದಾ ಮಧ್ಯದಲಿ
ಮೂಡಿಹ ಸ್ಮರನ ಮನೆಯಲ್ಲಿ ಜಗವು ಬಿ–
–ದ್ದಾಡುತ್ತಲಿಹುದು ಸರ್ವಜ್ಞ ೧೯೮

# స్త్రీ

తే॥ గీ॥ ఇహ పరమ్ములు సమకూరు నింతివలన
ఎల్ల సిరులతొ తులతూగు నింతివలన
ఇంతి వలదను వారలు ఇలనుగలరె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 193

॥ గీ॥ కూతురక్కయు, చెల్లెలు, కోడలత్త,
వదిన, తల్లియు సృష్టికి వలయు స్త్రీలె
వలదు ఈ సృష్టి యనగల్గు వనిత గలదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 194

॥ గీ॥ మాయబంధమ్ము కడురోత మగువయనెడి
వక్త, తత్త్వోపదేశియు, బ్రహ్మచారి,
ఎచట పుట్టిరి వీరెల్ల నచట గాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 195

। గీ॥ భక్త దాసులు, యోగులు, భాగవతులు,
కష్టజీవులు, మాయను కడకు ద్రోచి
దివిజ మార్గాన వచ్చిరా భువికి నేడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 196

గీ॥ మాయ గెలిచితినన వట్టి మాటగాదె
మాయనిర్మిత కాయమే మనుజుడైన
మాయ గెలుచుట సాధ్యమా ? మానవునకు !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 197

గీ॥ అందమొల్కు ఊరు ద్వయం బంటుచోట
నున్న సమ్మోహనాస్త్రని చిన్ని ఇల్లు
నందు విందున్కై లోక మాడు చుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 198

ತ್ರಿಪದಿ॥ ಊರಿದಾ ಚೇಳಿಸಿಂದೇರಿದಾ ಬೇನೆಯಲಿ
ಮೂರು ಜಗವೆಲ್ಲ ಹೊರಳುತಿಹುದಾ ನೋವ
ಮೀರಿದವರಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೧೯೯

ತ್ರಿಪದಿ॥ ಅಂಗನೆಯು ಒಲಿಯುವುದು, ಬಂಗಾರ ದೊರೆಯುವುದು
ಸಂಗ್ರಾಮದೊಳಗೆ, ಗೆಲುವುದು, ಇವು ಮೂರು
ಸಂಗಯ್ಯನೊಲಿಮೆ ಸರ್ವಜ್ಞ ೨೦೦

ತ್ರಿಪದಿ॥ ಲಿಂಗವಿಲ್ಲದ ಪೂಜೆ ಗಂಗೆಯಿಲ್ಲದ ತೋಟ
ಹೆಂಗಳಿಲ್ಲದ ಮನೆವಾರ್ತೆ ಅನುದಿನವು
ಭಂಗ ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೦೧

ತ್ರಿಪದಿ॥ ಅಡೆಯ ಮಾವಿನ ಹಣ್ಣು ಕಡಿದ ಕಬ್ಬಿನಗೆಣಿಕೆ
ಪಡೆದ ಒಡೆವೆಯನು ಹೆಣ್ಣನ್ನು, ಪರರಲ್ಲಿ
ಬಿಡುವವನೆ ಹೆಡ್ಡ ಸರ್ವಜ್ಞ ೨೦೨

ತ್ರಿಪದಿ॥ ಕೆಟ್ಟ ಮೈ ಹೆಂಗುಸನು ಬಟ್ಟೆಯಲಿ ತುರಿಚಿಯನು
ಅಟ್ಟಿಟ್ಟ ಕಡೆವ ಕಡೆಜನ ಹುಟ್ಟನ್ನು
ಮುಟ್ಟಬೇಡೆಂದ ಸರ್ವಜ್ಞ ೨೦೩

ತ್ರಿಪದಿ॥ ಸುಣ್ಣವಿಲ್ಲದ ವೀಳೆ ಬಣ್ಣವಿಲ್ಲದ ಮದುವೆ
ಹೆಣ್ಣಿಲ್ಲದವನ ಸಂಸಾರ, ಮಳಲೊಳಗೆ
ಎಣ್ಣೆಹುಯಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೦೪

తే॥ గీ॥ ధిటవుగా మారి బిరుసైన తేలుమోట 199
పోటు మెయికెక్కి త్రిజగాలు పొరలుచుండ
పోటు మీరిన ఘనులు నెచ్చోట గలరు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర.

తే॥ గీ॥ వలచి యెలనాగ తనకు దా వచ్చుటయును,
మెరుగు మేలిమి బంగారు దొరకుటయును,
ఆజి గెల్చుట నీ మూడు హరుని కృపయె !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 200

తే॥ గీ॥ లింగమూర్తియు గృహమున లేని పూజ
వారి సమ పూరమును లేక వాడుతోట
సతియులేనిల్లు ఈ మూడు సతమశాంతి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 201

తే॥ గీ॥ ఆర మాగిన కమ్మని ఆమ్ర ఫలము,
పొలతి, పుండ్రేక్షు ఖండము, భూషణమ్ము,
పరులతో నుంచ జనువాడు పామరుండు !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 202

తే॥ గీ॥ భోగ రోగాలతో నున్న భోగభామ
వాలు జిలతీవె, వెలివాడునాడుతెడ్డు
ముట్టుకొనబోకు మరచైన పట్టబోకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 203

తే॥ గీ॥ సున్నమునువీడి దినియెడి సొంపువిడెము
వన్నె వేయని పెండ్లిల్లు, వనిత లేని
కాపుర మిసుకలో నూనె కార్చినట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 204

# ವಿಷಮ ದಾಂಪತ್ಯ

ತ್ರಿಪದಿ॥ ವಿನಯ ವಿಲ್ಲದವಳಲ್ಲಿ ಮನವನಿಕ್ಕುವ ನೆಗ್ಗ
ಘನವಪ್ಪ ಬೂರಫಲಕಾಗಿ, ಪಕ್ಕಿಗಳು
ಜಿನುಗಿ ಸತ್ತಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೦೫

ತ್ರಿಪದಿ॥ ಸತ್ತವರ ಬಾಯೊಳಗೆ ಒತ್ತಿ ನೀರೆರೆದಂತೆ
ಚಿತ್ತವಿಲ್ಲದಳ ಸಂಸಾರ ಶುನಿ ಹೆಣನ
ಹತ್ತಿತಿಂದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೦೬

ತ್ರಿಪದಿ॥ ಒತಿರದ ಹೆಣ್ಣಿನೊಡೆ ಮಾತನಾಡುವ ನೆಗ್ಗ
ಹೂತ ಮಲ್ಲಿಗೆಯ ವನದೊಳಗೆ ತುರುಬಿಲ್ಲ-
-ದಾತ ಸುಳಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೦೭

ತ್ರಿಪದಿ॥ ಒಲ್ಲದವಳೊಡನಾಡಿ ಚೆಲ್ಲನಾಡುವ ನೆಗ್ಗ
ಕಲ್ಲ ಪುತ್ತಳಿಯ ಬಿಗಿದಪ್ಪಿ ಚುಂಬಿಸಲು
ಹಲ್ಲು ಹೋದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೦೮

ತ್ರಿಪದಿ॥ ಚಿತ್ತವಿಲ್ಲದ ಹೆಣ್ಣ ಗರ್ತಿ ಮಾಡುವ ನೆಗ್ಗ
ಬತ್ತಿದ ಕೆರೆಗೆ ಗಿಣಿಹಾರಿ, ಬಾಯಾರಿ
ಸತ್ತುಹೋದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೦೯

ತ್ರಿಪದಿ॥ ಹೆಣ್ಣು ಮುನಿದರೆ ತಿದ್ದುವಣ್ಣಗಳ ನಾಕಾಣೆ
ಹೆಣ್ಣೊಳಮೃತವು, ವಿಷವುಂಟು ಉಣಬಲ್ಲ
ಅಣ್ಣಗಳರಿತಿಹರು ಸರ್ವಜ್ಞ ೨೧೦

# విషమ దాంపత్యము

తే॥ గీ॥ వినయమెరుగని మగువపై మనసునిడుట
పక్షి నివహంబు బూరుగు పండ్లదినగ
ఆశపడి గింజుకొని జచ్చినట్లు గాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 205

తే॥ గీ॥ ఒత్తి మృతులకు నోట నీర్వోయు నట్లు
మనసు లేకున్న మగువతో మనుట నరయ
శవముపైనెక్కి శుని, దిన్న చందమగును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 206

తే॥ గీ॥ మమతయేలేని దానితో మాటలాడ
గోరిజనుమడ్డె, విరితోట గొప్పులేని
అన్నగళుడాడు చందమో ననగదగును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 207

తే॥ గీ॥ ఒల్ల నిల్లాలి పైనుల్ల ముంచు మూఢ
బ్రతుకు భారంబు హీనంబు, రాతి బొమ్మ
బట్టి ముద్దాడ పల్లాడ బడినయట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 208

తే॥ గీ॥ మనసిడని మంకు మగువను మార్చజనిన
నీర మింకిన సరసికి బారి చిల్క
చచ్చినట్లగు నా మూఢ జనుని బ్రతుకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 209

తే॥ గీ॥ అతివ కనలిన నలరించు అన్నలెవరు
అమృతముండును విషముండు నతిపమదిని
అలర గ్రోలెడి వారలే అరయుచుంద్రు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 210

# ಸಂಸಾರ ಸುಖ

ತ್ರಿಪದಿ॥ ಬೆಚ್ಚನೆಯ ಮನೆಯಾಗಿ ವೆಚ್ಚಕ್ಕೆ ಹೊನ್ನಾಗಿ
ಇಚ್ಛೆಯನು ಅರಿವ ಸತಿಯಾಗೆ ಸ್ವರ್ಗಕ್ಕೆ
ಕಿಚ್ಚುಹಚ್ಚೆಂದ ಸರ್ವಜ್ಞ ೨೧೧

ತ್ರಿಪದಿ॥ ಜೋಳದ ಬೋನಾಗಿ ಮೇಲೆ ಕೆನೆ ಮೊಸರಾಗಿ
ವೇಳೆಗೆ ಬರುವ ಸತಿಯಾಗಿ, ಸೂಳೆಯರಿಗೆ
ಕೋಳದಿಕ್ಕೆಂದ ಸರ್ವಜ್ಞ ೨೧೨

ತ್ರಿಪದಿ॥ ಕೆಂದ ಸಾದೆತ್ತಾಗಿ ಮುಂದರಿವ ಮಗನಾಗಿ
ಕುಂದದಲೆಗೆಯ್ವ ಸೊಸೆಯಾದ ರಾಮನಿಗೆ
ಬಿಂದಿಗೆಯ ಹೊನ್ನು ಸರ್ವಜ್ಞ ೨೧೩

ತ್ರಿಪದಿ॥ ಹಳ್ಳಗದ್ದೆಗಳಾಗಿ ಕುಳ್ಳವೆರಡೆತ್ತಾಗಿ
ಒಳ್ಳೆ ಗುಣವವಳು ಸೊಸೆಯಾದ ರಾಮನಿಗೆ
ಬಳ್ಳದಲಿ ಹೊನ್ನು ಸರ್ವಜ್ಞ ೨೧೪

ತ್ರಿಪದಿ॥ ಸಿರಿಯು, ಸಂಸಾರವನು ಸ್ಥಿರವೆಂದು ನಂಬದಿರು
ಹಿರಿದೊಂದು ಸಂತೆ ನೆರೆದೊಂದು ಜಾವಕ್ಕೆ
ಹರಿದು ಹೋದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೧೫

ತ್ರಿಪದಿ॥ ಬಗೆಬಗೆಯ ಭೋಗಕ್ಕೆ ನಗುತಿಹರು ಸತಿಸುತರು
ನಗೆ ಹೋಗಿ ಹೊಗೆಯು ಬರಲವರು, ಅಡವಿಯಲಿ
ಒಗೆದು ಬರುತಿಹರು ಸರ್ವಜ್ಞ ೨೧೬

# సంసార సుఖము

తే॥ గీ॥ వెచ్చదనమిచ్చు భవనంబు, వెచ్చమునకు
వచ్చుసిరి, వశవర్తిని భార్య గలుగ
స్వర్గమేటికి కాల్పనా జనులకరయ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 211

తే॥ గీ॥ జొన్నలన్నము మీగడయున్న పెరుగు
వచ్చి తగువేళ నిచ్చుతో వాలుభార్య
గలుగ వేశ్యకు సంకెళ్ళ గరిమదిక్కు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 212

తే॥ గీ॥ కందు మెయిచాయ యెద్దైన, గౌరవంబు
పెంచు సుతుడైన, కోడలు మంచిదైన
అందు బంగారు నిండిన బిందెయుండు !
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 213

॥ గీ॥ వాగు వరిమళ్ళు, పొట్టివి సాగుటెడ్లు
కోడలుత్తమురాలుగాకూడు ఇంట
పంట బంగారమై నిల్చు బళ్ళమందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 214

॥ గీ॥ సిరియు సంసారములు గన స్థిరము గావు
మరులు గొనకము యున్నట్లె, మాయమగును
జాములోచేరి, విడిపోవు, సంతలట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 215

। గీ॥ అతుల సుఖభోగములు గూర్ప నతివ సుతులు
నవ్వుచుందురు, వగగల్గి నగవు చెడిన
విడుతురవ్వాని మరునాడు విపినమందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 216

# ಅನ್ನದ ಮಹಿಮೆ

ತ್ರಿಪದಿ॥ ಕೊಟ್ಟಣವ ಕುಟ್ಟುವುದು ಮೊಟ್ಟೆಯನು ಹೊರಿಸುವುದು
ಬಿಟ್ಟಿ ಕೂಲಿಗಳ ಮಾಡುವುದು, ಗೇಣು
ಹೊಟ್ಟೆ ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೧೭

ತ್ರಿಪದಿ॥ ಸಾಲವನು ಮಾಡುವುದು ಹೇಲ ತಾ ಬಳಿಸುವುದು
ಕಾಲಿನ ಕೆಳಗೆ ಹಾಕುವುದು, ತುತ್ತಿನಾ
ಚೀಲ ನೋಡಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೧೮

ತ್ರಿಪದಿ॥ ಕನ್ನವನು ಕೊರಿಸುವುದು ಭಿನ್ನವನು ತರಿಸುವುದು
ಬನ್ನದ ಸೆರೆಗೆ ಒಯ್ಯುವುದು ಒಂದು ಹಿಡಿ
ಅನ್ನ ನೋಡೆಂದ ಸರ್ವಜ್ಞ ೨೧೯

ತ್ರಿಪದಿ॥ ಕುಲವನ್ನು ಕೆಡಿಸುವುದು ಚಲವನ್ನು ಬಿಡಿಸುವುದು
ಹೊಲೆಯನ ಮನೆಯ ಹೊಗಿಸುವುದು ಕೂಳಿನ
ಬಲುಮೆ ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೨೦

ತ್ರಿಪದಿ॥ ನೇತ್ರಗಳು ಕಾಣಿಸವು ಶ್ರೋತ್ರಗಳು ಕೇಳಿಸವು
ಗಾತ್ರಗಳೆದ್ದು ನಡೆಯವು ಕೂಳೊಂದು
ರಾತ್ರಿ ತಪ್ಪಿದರೆ ಸರ್ವಜ್ಞ ೨೨೧

ತ್ರಿಪದಿ॥ ನಿದ್ದೆಗಳು ಬಾರವು ಬುದ್ಧಿಗಳು ತೋರವು
ಮುದ್ದಿನ ಮಾತು ಸೊಗಸವು, ಬೋನದ
ಮುದ್ದೆ ತಪ್ಪಿದರೆ ಸರ್ವಜ್ಞ ೨೨೨

# అన్న మహిమ

తే॥ గీ॥ ధాన్యమును దంచుచుండుట, ధాన్యరాశి
మూటలన్నించి, మూపున మోయుచుంట
వెట్టిచాకిరి జేయుటీ పొట్ట కొరకె,
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 217

తే॥ గీ॥ పప్పునుప్పుకు అప్పులపాలు చేయు
హేయమలమూత్రముల నూడ్చి యెత్తజేయు
పాదదాసుల జేయు నీ పాడు పొట్ట
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 218

తే॥ గీ॥ కన్నమును వేయజేయును, కాపురములు
కూలజేయును చెరసాల పాలు జేయు
పిడికెడన్నము నీ పొట్ట నిడుట కొరకె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 219

తే॥ గీ॥ కులము చెరచును ప్రతిన నిష్ఫలము జేయు
శల్య మాంసములుడికించు శ్వపచునింట
పట్టెడన్నము పెట్టు నీపొట్లు గనుమ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 220

తే॥ గీ॥ కనులు చీకట్లు గ్రమ్మును, వినవు చెవులు
తొడలు నడయాడ వడవడ వడకుచుండు
ఒక్క రేయిని యొక ముద్ద తక్కువైన
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 221

తే॥ గీ॥ నిద్దురయు రాదు కనుమూయ బుద్ధి గలచు
సొగసు వలపుల పలుకులు సొంపు లీవు
ముద్ద నోటికి రాని ఏ ప్రొద్దునైన
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 222

ತ್ರಿಪದಿ॥ ಕಣ್ಣುಗಳು ಇಳಿಯುವವು ಬಣ್ಣಗಳು ಅಳಿಯುವವು
ಹುಣ್ಣಿಮೆಯ ಹೋದ ಶಶಿಯಂತೆ ಅಶನವನು
ಉಣ್ಣದವನೊಡಲು ಸರ್ವಜ್ಞ ೨೨೩

ತ್ರಿಪದಿ॥ ಅನ್ನದೇವರ ಮುಂದೆ ಇನ್ನು ದೇವರು ಉಂಟೆ
ಅನ್ನ ಉಂಟಾದರುಣಲುಂಟು ಜಗದೊಳಗೆ
ಅನ್ನವೇ ದೈವ ಸರ್ವಜ್ಞ ೨೨೪

ತ್ರಿಪದಿ॥ ಅನ್ನವನು ಇಕ್ಕುವ ಅನ್ಯಜಾತನೆ ಕುಲಜ
ಅನ್ನವನು ಇಕ್ಕದುಣತಿಪ್ಪ ಕುಲಜಾತ
ಅನ್ಯನೆಂದರಿಗು ಸರ್ವಜ್ಞ ೨೨೫

ತ್ರಿಪದಿ॥ ಕೊಟ್ಟುಂಬಕಾಲದಲಿ ಕೊಟ್ಟುಣಲು ಕರಿಯದಿರೆ
ಹುಟ್ಟುವಿನ ಒಳಗೆ ಜೇನಿಕ್ಕಿ ಪರರಿಂಗೆ
ಬಿಟ್ಟು ಹೋದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೨೬

ತ್ರಿಪದಿ॥ ಅನ್ನ ದಾನಕ್ಕಿಂತ ಇನ್ನು ದಾನಗಳಿಲ್ಲ
ಅನ್ನಕ್ಕೆ ಮಿಗಿಲು ಇನ್ನಿಲ್ಲ ಜಗದೊಳಗೆ
ಅನ್ನವೇ ಪ್ರಾಣ ಸರ್ವಜ್ಞ ೨೨೭

ತ್ರಿಪದಿ॥ ಅನ್ನವನು ಇಕ್ಕಿದನು ಉನ್ನತವ ಪಡೆಯುವನು
ಉನ್ನತನಪ್ಪಯತಿಗಿಕ್ಕ ದಾಲೋಭಿ
ಕುನ್ನಿಗೂ ಕಷ್ಟ ಸರ್ವಜ್ಞ ೨೨೮

తే॥ గీ॥ కనులు గుంటలు వడిపోవు కాంతితరుగు
కృష్ణ పక్షపు శశివోలె కృశతనొందు
అశనమబ్బని దీను దేహమును గనుమ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 223

తే॥ గీ॥ అన్నమును మించు దైవమ్ము ఎన్నలేదు
ఆర్తులాకలి మాన్పించు అన్నమున్న
అన్నమే పరదైవ మీ యవని యందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 224

తే॥ గీ॥ అన్యజాతుడునయినను, అన్నమిడెడు
వాడె కులజుడు. పెట్టనివాడె భువిని
కులజుడైనను ఎడవాని కులమువాడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 225

తే॥ గీ॥ గడన కలనాడు అర్థికిన్నిడని వాడు
జుమ్మ నెగసెడి తేనీగ జుంటితేనె
పుట్టలోనిడి నేరికో బెట్టినట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 226

తే॥ గీ॥ అన్నదానము కంటెను మిన్నయైన
దానమేదియు లేదన్న తప్పుకాదు
అన్నమే జగతికి ప్రాణమగును సుమ్ము
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 227

తే॥ గీ॥ అన్నమిడువాడె జగతిపై ఉన్నతుండు
సన్నుతుండైన యతికి తా నన్నమిడని
క్రూర కర్ముడు, హీనుండు కుక్కకన్న
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 228

# ಲೋಕ ನೀತಿ

ತ್ರಿಪದಿ॥ ಹೆಂಡತಿಗೆ ಅಂಜುವ ಗಂಡುಸನು ಏನೆಂಬೆ
ಹಿಂಡು ಕೋಳಿಗಳ ಮುರಿತಿಂಬ ಸರಿ ನಾಯ
ಕಂಡೋಡಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೨೯

ತ್ರಿಪದಿ॥ ಬೇಡಗಡವಿಯ ಚಿಂತೆ ಆಡಿಂಗೆ ಮಳೆ ಚಿಂತೆ
ನೋಡುವ ಚಿಂತೆ ಕಂಗಳಿಗೆ, ಹೆಳವಗೆ–
–ದ್ದಾಡುವಾ ಚಿಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೩೦

ತ್ರಿಪದಿ॥ ಆಡಿ ಮರುಗಲು ಹೊಲ್ಲ ಕೂಡಿ ತಪ್ಪಲು ಹೊಲ್ಲ
ಬೇಡನನಂಟು ನೆರೆಹೊಲ್ಲ ಅವನಕುರಿ–
–ತಾಡುವದೆ ಹೊಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೨೩೧

ತ್ರಿಪದಿ॥ ಕಿರಿಮೀನು ಹಿರಿಮೀನು ಕೊರೆಕೊರೆದು ತಿಂಬಾತ–
–ಗಿರುವ ನೊಬ್ಬ ಮಗ ಸಾಯೆ, ನೋವಿನ
ತೆರನ ತಾನರಿವ ಸರ್ವಜ್ಞ ೨೩೨

ತ್ರಿಪದಿ॥ ಬಂಡಿ ಯಚ್ಚಿಗೆ ಭಾರ, ಮಿಂಡೆ ಮುದುಕಗೆ ಭಾರ
ಗುಂಡುಗಳು ಭಾರ ಚೈತ್ರಕ್ಕೆ, ಲೋಕಕ್ಕೆ
ಕೊಂಡೆಯನೆ ಭಾರ ಸರ್ವಜ್ಞ ೨೩೩

ತ್ರಿಪದಿ॥ ಹುತ್ತ ಹಾವಿಗೆ ಲೇಸು ಮುತ್ತು ಕೊರಳಿಗೆ ಲೇಸು
ಕತ್ತೆಯಹೇರು ತರಲೇಸು, ತುಪ್ಪನ್ನದಾ
ತುತ್ತುಲೇಸೆಂದ ಸರ್ವಜ್ಞ ೨೩೪

# లోక నీతి

తే॥ గీ॥ మగువకదరెడి మగని నేమనగవలయు
కోళ్ళ వరుసెట్టిదిను కుక్క, నక్క జూచి
పరుగు వెనుకకు లంకించు కరణి జూవె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 229

తే॥ గీ॥ కానపై చింత బోయకు, వానపైన
చింత మేకకు, కనులకు చింత జూడ
అవిటి వానికి నడయాడ నగును చింత
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 230

తే॥ గీ॥ ఆడి బొంకతప్పు, చెలిమి వీడ తప్పు
బోయతో గూడి నెయ్యము చేయ తప్పు
వాని యూసెత్త రాదెంత వానికైన
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 231

తే॥ గీ॥ చేపలను బట్టి పెద్దవి, చిన్నవనక
తరిగి గరగర మరగించి కొరికి తినెడు
వాని పుత్రుడు చావ, నా బాధ తెలియు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 232

తే॥ గీ॥ బండి యిరుసుకు భారంబు, మిండలాడి
ముసలి మగనికి భారంబు, వసుధయందు
మెండు బరువగు జనులకు కొండెకాడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 233

తే॥ గీ॥ అనుపమంబుగ పుట్ట పాముకు లెస్స
ఆణిముత్యము గళసీమ నలర లెస్స
నేతితో గూడి భుజియింప ప్రీతి లెస్స
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 234

ತ್ರಿಪದಿ॥ ನೆಗ್ಗಿಲಾನೆಗೆ ಹೊಲ್ಲ ಸಿಗ್ಗು ಸೂಳೆಗೆ ಹೊಲ್ಲ
ಸುಗ್ಗಿಕಾಲದಲಿ ಮಳೆ ಹೊಲ್ಲ, ಕೊಂಡೆಯನ
ಕಿಗ್ಗಳವೆ ಹೊಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೨೩೫

ತ್ರಿಪದಿ॥ ಮುಟ್ಟಿದೆಡರಿಗೆ ಅಭಯ ಕೊಟ್ಟಾತ, ದಾತಾರ
ಕೆಟ್ಟ ಕಾರ್ಯವನು ತಿದ್ದಿದರೆ ಅವನೊಂದು
ನೆಟ್ಟನೇ ದೈವ ಸರ್ವಜ್ಞ ೨೩೬

ತ್ರಿಪದಿ॥ ಅರಿತವರ ಮುಂದೆ ತನ್ನರಿವನ್ನು ಮೆರೆಯುವುದು
ಅರಿಯದರ ಮುಂದೆ ಮೆರೆದರೆ, ಹೊನ್ನೆಂಬ
ತೊರೆಯ ಲೆಚ್ಚಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೩೭

ತ್ರಿಪದಿ॥ ಸಪ್ಪನ್ನ ಉಣಹೊಲ್ಲ, ಮುಪ್ಪು ಬಡವಗೆ ಹೊಲ್ಲ
ತಪ್ಪಿನಲಿ ಸಿಲುಕಿ ಇರೆಹೊಲ್ಲ, ಜಾರೆಯನು
ಅಪ್ಪುವುದೆ ಹೊಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೨೩೮

ತ್ರಿಪದಿ॥ ಶ್ವಾನ ಬಾಲವು ಡೊಂಕು ಹೀನಮನವದು ಡೊಂಕು
ಕಾನನದಿ ಹರಿವ ಹೊಳೆ ಡೊಂಕು ಪಿಸುಣಿಗನ
ಶಾನೆ ಡೊಂಕೆಂದ ಸರ್ವಜ್ಞ ೨೩೯

ತ್ರಿಪದಿ॥ ಕೋಡಗನ ಒಡನಾಡಿ ಕೇಡಕ್ಕು ಸಂಸಾರ
ಕಾಡಾಡಿ ಕೆಂಪು ಮಾಣಿಕವ, ಕಲ್ಲೆಂದು
ಈಡಾಡಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೪೦

తే॥ గీ॥ లజ్జ కులటకు, పంట కాలాన వాన
కరికి పల్లేరు, నహితమ్మై బరగునట్లు
జగతి కహితంబు సూచక స్వనముచూవె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 235

తే॥ గీ॥ ఎడరు దొడరిన నభయంబునిడిన దాత
చెడిన కార్యంబు చేపట్టి చెలువు తీర్చ
నతడు ప్రత్యక్ష దైవమే యగును చూవె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 236

తే॥ గీ॥ ప్రజ్ఞ జూపిన లగ్గగు ప్రాజ్ఞులెదుట
అజ్ఞులను జేరి తన ప్రజ్ఞ నచట నెరప
కోరి బంగారు చేజార్చు కొనిన యట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 237

తే॥ గీ॥ చప్పిటన్నము దినరోత, తప్పిదమున
మునుగగా రోత, బీదకు ముదిమి రోత,
జార పరిరంభమది రోత జగతి యందు!
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 238

తే॥ గీ॥ శ్వానమునకు . తోక, ఖలుని మానసమ్ము,
అడవి సెలయేరు వంకరలగును, కాని
కడిది వంకర పిశునుండు గళము విప్ప
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 239

తే॥ గీ॥ ఘాతుకుని తోడి నెయ్యంబు గాసిదెచ్చు
రక్తి కాపురమును గూల్చు, రాయటంచు
విమల రత్నంబు నడవిలో విసరునట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 240

ತ್ರಿಪದಿ॥ ಕಟ್ಟಾಳು ತಾನಾಗಿ ಬಟ್ಟೆಯಲಿ ನೆರವೇಕೆ
ಸೆಟ್ಟಿಗೆ ತೊಡಲು ನುಡಿಯೇಕೆ, ಅರಿದಂಗೆ
ನಿಷ್ಠುರವದೇಕೆ ಸರ್ವಜ್ಞ ೨೪೧

ತ್ರಿಪದಿ॥ ಅತಿಯಾಶೆ ಮಾಡುವನು ಗತಿಗೇಡಿಯಾಗುವನು
ಅತಿಯಾಸೆಯಿಂದ ಮತಿಕೆಡಗು, ರತಿಯಿಂದ
ಸತಿಸುತರು ಕೆಡುಗು ಸರ್ವಜ್ಞ ೨೪೨

ತ್ರಿಪದಿ॥ ಅತ್ತೆಮಾಡಿದ ತಪ್ಪು ಗೊತ್ತಿಲ್ಲದಡಗುವುದು
ತೊತ್ತದನ ಮಾಡಿದರೆ ಕ್ಷಣದಿ ಸರುವರಿಗೆ
ಗೊತ್ತಹುದು ನೋಡ ಸರ್ವಜ್ಞ ೨೪೩

ತ್ರಿಪದಿ॥ ವ್ಯಸನದಲಿ ದೇಹವು ಮಸಣವನು ಕಾಣುವುದು
ವ್ಯಸನವನು ಬಿಟ್ಟು ಹಸನಾಗಿ ದುಡಿದರೆ
ಅಶನ ವಸನಗಳು ಸರ್ವಜ್ಞ ೨೪೪

ತ್ರಿಪದಿ॥ ಗೀತವಾದ್ಯವ ಕಲಿತ ಜಾತರ ಒಲಿಮೆಯನು
ರೀತಿಯಲಿ ಅರಿಯಲರಿಯದಿರು, ಪಾತಕರ
ಮಾತಿನಿಂ ಕೆಡುಗು ಸರ್ವಜ್ಞ ೨೪೫

ತ್ರಿಪದಿ॥ ಉರಗನ ಹಲುನಂಜು ಸುರಿಗೆಯ ಮೊನೆನಂಜು
ಕರುಣವಿಲ್ಲದನ ನುಡಿನಂಜು ದುರ್ಜನರ
ಇರವೆಲ್ಲ ನಂಜು ಸರ್ವಜ್ಞ ೨೪೬

గీ॥ బలియుడైయున్న తనవెంట భటుడదేల
కల్ల పలుకేల వర్తక తల్లజునకు
పరుస తనమేల జ్ఞానికి స్మరసిచూడ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 241

గీ॥ అమిత వాంఛల తోడనాయాస పడిన
గతులు తప్పును మరిమీద మతియు చెడును
సతియు సుతులును చెడుగులై సంచరింత్రు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 242

గీ॥ అత్త జేసిన తప్పైన నణగి పోవు
పెదవి దాటదు ఇంటికి పెద్దగాన
అదియె, కోడలు జేసిన నారడియగు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 243

గీ॥ వ్యసనమున దేహమది మృత్యువాటి చేరు
వ్యసనమును వీడి గడన ధర్మాన జేయ
అశన వసనము లబ్బును అతిశయముగ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 244

గీ॥ గీత చదువగ నేర్వ వ్యాఖ్యాత యగున
జాతరపు ప్రీతి చదువైన చదువదెట్లు
తెలిసి తెలియని పతితుల పలుకు చెరుపు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 245

గీ॥ త్రాచు కోర విషము, ఖడ్గధార విషము
ఎన్న నిర్దయు నుడికార మెల్లవిషము
ధూర్తుడగువాని ఇరవెల్ల దోగు విషము

ತ್ರಿಪದಿ|| ಉರಗನ ಮುಖದಿ ಸಿಕ್ಕಿರುತಿಪ್ಪಕಪ್ಪೆ ತಾ-
ನೆರಗುವ ನೊಣಕೆ ನೆಗೆದಂತೆ, ಸಂಸಾರ
ದಿರವು ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೪೭

ತ್ರಿಪದಿ|| ಆಡದಲೆ ಮಾಡುವನು ರೂಢಿಯೊಳಗುತ್ತಮನು
ಆಡಿ ಮಾಡುವನು ಮಧ್ಯಮನು, ಅಧಮ ತಾ-
-ನಾಡಿ ಮಾಡದವ ಸರ್ವಜ್ಞ ೨೪೮

ತ್ರಿಪದಿ|| ನಾರಿಯಿಲ್ಲದ ಮನೆಯು, ಪಾರಿಯಿಲ್ಲದ ದುರ್ಗ
ಮೇರೆತಪ್ಪಿದನ ಮನ್ನಣೆಯು, ಇವು ಮೂರು
ಮಾರಿ ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೪೯

ತ್ರಿಪದಿ|| ಓದು ಇಲ್ಲದವಾದ ಭೇದಿಸುವ ದುರ್ಬುದ್ಧಿ
ಕಾದಲರಿಯದನ ಆಳಿಕೆಯು, ಇವು ಮೂರು
ಹೋದರೇ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೨೫೦

ತ್ರಿಪದಿ|| ಪುಷ್ಪವಿಲ್ಲದ ಪೂಜೆ ಅಶ್ವವಿಲ್ಲದ ಅರಸು
ಅಪ್ಪಲೊಲ್ಲದಳನಗೆ ನುಡಿಯು, ಇವು ಮೂರು
ಸಪ್ಪೆಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೫೧

ತ್ರಿಪದಿ|| ಹೋಳಿಗಿಲ್ಲದ ಹಬ್ಬ ಮೇಳವಿಲ್ಲದ ಕೂಟ
ಆಳಿಲ್ಲದವನ ದೊರೆತನವು, ಇವು ಮೂರು
ಹಾಳು ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೫೨

తే॥ గీ॥ కారడవి కాల సర్పంబు కోరలందు
జిక్కువడి కప్ప ఈగకై జిహ్వజాచి
ఆశపడుభంగి సంసార పాశమరయ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 247

తే॥ గీ॥ ఆడకనె చేయ నుత్తముండనగ బరగు
ఆడిచేయును మధ్యముడైన వాడు
ఆడిచేయక నున్నవాడధమ జనుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 248

తే॥ గీ॥ ఆలు లేనిల్లు, సేన లేనట్టి కోట,
హద్దుమీరిన గద్దరి పెద్దరికము
మారికనదగు నీ మూడు దేరిచూడ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 249

తే॥ గీ॥ చదువెరుంగని వాదము, అదనెరింగి
భేదమును చేయు దుర్బుద్ధి, పిరికివాని
పాలనివిమూడు పోవంగ మేలు చూవె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 250

తే॥ గీ॥ సారసుమ సంచయము లేక సలుపుపూజ
హత్తుకోనరాక చెలినవ్వులాట పలుకు
వాజి లేని నృపతి నిష్ప్రయోజకములు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 251

తే॥ గీ॥ భక్ష్యముల వంటజేయని పండుగయును
కలయికల మేల్మి విడనాడి సలుపు సభలు
రహిత భటకోటి ప్రభుత నిరర్థకములు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 252

ತ್ರಿಪದಿ॥ ಒತ್ತಿ ಮಾಡಿದ ಹಣ್ಣು, ಹೊತ್ತು ಮಾರಿದ ಲಾಭ
ಸತ್ತವರಿಗತ್ತ ಕಣ್ಣೀನೆ, ಇವು ಮೂರು
ವ್ಯರ್ಥ ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೫೩

ತ್ರಿಪದಿ॥ ಒಕ್ಕಲಿಲ್ಲದ ಊರು ಮಕ್ಕಳಿಲ್ಲದ ಮನೆಯು
ಲೆಕ್ಕವಿಲ್ಲದ ಬೇಹಾರ, ಇವು ಮೂರು
ದುಕ್ಕ ಕಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೫೪

ತ್ರಿಪದಿ॥ ಗಡಿಯ ನಾಡಿನ ಸುಂಕ, ತಡಿಯಲಂಬಿಗ ಕೂಲಿ
ಮಡದಿಯರ ಒತ್ತೆ, ಒಳ ಲಂಚ, ಇವು ನಾಲ್ಕು
ಅಡಿಯಿಟ್ಟಡಿಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೨೫೫

ತ್ರಿಪದಿ॥ ಮಾತಿನ ಮಾಲೆಯು, ತೂತಾದ ಮಡಿಕೆಯು,
ಹಾತೆಯು, ಹಲ್ಲುಸರವೆಯು, ಇವು ನಾಲ್ಕು
ಯೇತಕ್ಕು ಬೇಡ ಸರ್ವಜ್ಞ ೨೫೬

ತ್ರಿಪದಿ॥ ಹೊಲೆಯಗಿತ್ತಾಸಾಲ, ಒಲೆಯ ಮೇಲಿನ ಹಾಲು,
ಲಲನೆಯರ ಒಲುಮೆ, ಹುಲುಗಿಚ್ಚು, ಇವು ನಾಲ್ಕು
ನಿಲಲಿಲ್ಲವಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೫೭

ತ್ರಿಪದಿ॥ ಪ್ರತ್ಯಕ್ಷ ಉರಗನ ಮಸ್ತಕವು ಹಲುನಂಜು
ಮತ್ತೆ ದುರ್ಜನರ ಕರ, ಮುಖವು, ಶಿರ, ಪಾದ,
ಸತ್ಯವು ನಂಜು ಸರ್ವಜ್ಞ ೨೫೮

తే॥ గీ॥ ఒగ్గి చేసిన పంట, త్రానెత్తి మోత
అమ్మగావచ్చు లాభము, ఆత్మబంధు
ప్రీతికి నై యేడ్పు కనుబాధ దుష్ఫలమె యిమ్ము
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 253

తే॥ గీ॥ పిల్ల పాపల నోచని ఇల్లు, హాలము,
బట్టకుండిన యూరును, పద్దువ్రాయ
బడనిబేరము లీనూడు, బాధగూర్చు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 254

తే॥ గీ॥ పరగణాహద్దు సుంకంబు, పడవకూలి,
లలన కట్నము గుట్టుగా లంచమిడుట,
పాయరానివి ఇవి నాల్గు బంధకములు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 255

తే॥ గీ॥ పలుకులతో గూర్చు పూలయు, పరియమంత
చెలగు శలభము, గడ్డితో చేయు గొలుసు
చెల్లుబడి గాని వీ నాల్గు చెప్పనేల
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 256

తే॥ గీ॥ హీనబుద్ధియుకలవానికిచ్చు అప్పు
ప్రొయ్యి మీదున్న పాలును, పొలతివలపు,
గడ్డి గాయములీనాల్గు కాదునిల్వ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 257

తే॥ గీ॥ తలను కోరల విషముండు, త్రాచునకును
ఖలుని మస్తక ముఖ పాద కరములనక
నిలువు నిలువెల్ల విషముతో నిండియుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 258

ತ್ರಿಪದಿ॥ ಹರದನ ಮಾತನ್ನು ಹಿರಿದು ನಂಬಲುಬೇಡ
ಗರಗಸದೊಡನೆ ಮರಹೋರಿ ತನ್ನ ತಾ–
–ನಿರುದು ಕೊಂಡಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೫೯

ತ್ರಿಪದಿ॥ ಸುಂಕಿಗನು ಹುರಿಹಲ್ಲು, ಬಿಂಕದ ಬೆಲೆವೆಣ್ಣು,
ಕಂಕಿಯು, ಸುಂಕ, ನಸುಗುನ್ನಿ ಇವು ಆರು
ಸೋಂಕಿದರೆ ಬಿಡವು ಸರ್ವಜ್ಞ ೨೬೦

ತ್ರಿಪದಿ॥ ಹರಿವ ನೀರೆರವಳ್ಳಿ, ತುರಗ, ಚೈತ್ರವು, ಬಂಡಿ
ಅರಸನ ಮನವು, ಬೆಲೆವೆಣ್ಣು, ಇವು ಏಳು
ತಿರುಹುವವರಿಚ್ಛೆ, ಸರ್ವಜ್ಞ ೨೬೧

ತ್ರಿಪದಿ॥ ಹಾಸು ಇಲ್ಲದ ನಿದ್ರೆ ಪೂಸು ಇಲ್ಲದ ಮೀಹ
ಭಾಷೆಯರಿಯದಳ ಗೆಳೆತನವು, ಮೋಟಿ, ಕೈ
ಬೀಸಿಕರೆದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೬೨

ತ್ರಿಪದಿ॥ ಅಬ್ಬೆಗರಿಷಿಣವೇಕೆ, ಕಬ್ಬೇಕೆ ಬೋಡಂಗೆ
ನಿಬ್ಬಣವು ಏಕೆ ಕುರುಡಂಗೆ ವನದೊಳಗೆ
ಹೆಬ್ಬುಲಿಯದೇಕೆ ಸರ್ವಜ್ಞ ೨೬೩

ತ್ರಿಪದಿ॥ ವಿದ್ಯಕಲಿಸದ ತಂದೆ, ಬುದ್ಧಿಹೇಳದ ಗುರುವು
ಬಿದ್ದಿರಲು ಬಂದು ನೋಡದ ತಾಯಿಯು
ಶುದ್ಧ ವೈರಿಗಳು ಸರ್ವಜ್ಞ ೨೬೪

గీ॥ వర్తకుని పల్కులను నమ్మవలదు సుమ్మ
తరువు అంపముతో పోరదగునదెట్లు
తన వినాశము తా దెచ్చుకొనుట గాదె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 259

గీ॥ పన్ను, సుంకరి, పురిపల్లు, పడుపు గత్తె
కృశత నొందిన కోమలి నసపు తీవె
లరయ నీయారు సోకిన యంత విడవు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 260

గీ॥ పారు నీరును, లేతీవె, వారువమ్ము
పడవ, వెలయాలు, శకటము, ప్రభుని మనసు
ద్రిప్పు వారిచ్చ నీయేడు దిరుగుచుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 261

గీ॥ పానుపుండని నిద్ర, లేపనము లేని
స్నానమును, భాష తెలియని నాతి చెలిమి
నరయ కరమూపి కపిల రమ్మన్న యట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 262

గీ॥ చీకునకు వెల్గు బోసికి చెరకదేల
ఐదువము లేక పసుపేల అవ్వకైన
పుష్ప ఫల భరిత వాటిక బులియదేల
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 263

గీ॥ చదువు నేర్పని జనకుండు శత్రువరయ
బుద్ధి చెప్పని గురుడు తా బోద్ధ కాదు
ఆపదను జూడకున్నమ్మ అమ్మకాదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 264

ತ್ರಿಪದಿ॥ ಅಳಿಯೂರ ತಳವಾರ, ಕಳೆಯುಳ್ಳ ಸೂಳೆಯು,
ಹೊಳಲ ಸುಂಕಿಗನು, ಹಳೆ ನಾಯಿ, ಯಾಚಕನು
ತೊಲಗುವವರಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೨೬೫

ತ್ರಿಪದಿ॥ ಗೀತ, ವಾದ್ಯವು, ನೃತ್ಯ, ಓತವರ ಒಲಿಮೆಯು,
ಪ್ರೀತಿಯ ನುಡಿಯು, ಒಳಮಾತು, ಹೆಗ್ಗಡೆಯ
ಮಾತಿನಿಂಕೆಡಗು ಸರ್ವಜ್ಞ ೨೬೬

ತ್ರಿಪದಿ॥ ನಲ್ಲ ಒಲ್ಲಿಯನೊಲ್ಲ, ನೆಲ್ಲಕ್ಕಿ ಬೋನೊಲ್ಲ
ಅಲ್ಲವನು ಒಲ್ಲ, ಮೊಸರೊಲ್ಲ, ಯಾಕೊಲ್ಲ?
ಇಲ್ಲ, ಅದಕೊಲ್ಲ, ಸರ್ವಜ್ಞ ೨೬೭

ತ್ರಿಪದಿ॥ ಸತ್ಯಕ್ಕೆ ಸರಿಯಿಲ್ಲ, ಮಿಥ್ಯಕ್ಕೆ ನೆಲೆಯಿಲ್ಲ
ಹೆತ್ತಮ್ಮನಿಂದ ಹಿತರಿಲ್ಲ, ನರರೊಳಗೆ
ನಿತ್ಯರೇ ಇಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೨೬೮

ತ್ರಿಪದಿ॥ ಏರುವ ಕುದಿರೆಯನು, ಹೇರುವ ಎತ್ತನ್ನು,
ಬೇರೂರಲಿದ್ದ ಸತಿಯನ್ನು, ಬೇರೊಬ್ಬ–
–ರೇರದೇಬಿಡರು ಸರ್ವಜ್ಞ ೨೬೯

ತ್ರಿಪದಿ॥ ಸತ್ತವರಿಗತ್ತು ಬೇಸತ್ತವರು ಉಳಿವರೇ
ಹತ್ತೆಂಟು ಕಾಲ ತಡವಕ್ಕು, ಬಳಿಕೆಲ್ಲ–
–ರತ್ತಲೇ ಅಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೨೭೦

తే॥ గీ॥ పన్నులధికారి, భిక్షువు, పడుపుగత్తె
పాత తలవరి, ముదుసలి, బడుగుకుక్క
కదలిపోలేరు పురమును వదలివీరు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 265

తే॥ గీ॥ గాన, వాద్యజ్ఞ, నృత్య, వ్యాఖ్యాన, హర్ష
భాషణంబుల నైపుణి, ప్రల్లదముల
బలికి తా పొగడుకొనుట వలన చెడును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 266

తే॥ గీ॥ పట్టుబట్టల నొల్లడు, గట్టి పెరుగు,
నొల్లడల్లము వరి యన్న మొల్లడయ్యొ
ఎందుకొల్లడు లేమిచే నొల్లడయ్యొ
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 267

తే॥ గీ॥ సత్య మహిమంబునకు ఏది సాటిలేదు
అనృతమగు దాని కిరవు తా నరయలేదు
జనని కెనలేదు ప్రాణు లశాశ్వతములు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 268

తే॥ గీ॥ స్వారి గుఱ్ఱము, బలమైన సబర పెద్దు,
పరగ పొరుగూర ఆలున్న, పాపమనక
వాడుకొనెదరు, విడిచెడువారు గలరె?
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 269

తే॥ గీ॥ పరమపదమును పొందిన వారి కేడ్చు
చుండువారలు నిచటనే యుండగలర
ఇంచుమించుగ నచటికే నేగ వలయు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 270

ತ್ರಿಪದಿ॥ ಪತ್ತ[illegible] ಮಾರಿ ತೊತ್ತತಂದಾತೆರಪಿ
ತುತ್ತಿ[illegible]ತುರಕ, ತತ್ತ್ವವನು ತೊರೆದಿಹನು
ಕತ್ತೆ[illegible]ದ ಸರ್ವಜ್ಞ ೨೭೧

ತ್ರಿಪದಿ॥ ಪಟ್ಟಾಸೆ ಕಾಲಿಂಗೆ ಹೊಟ್ಟಾಸೆ ಆವಿಂಗೆ
ಬೆಟ್ಟಗಳ ಆಶೆ ಮೃಗಗಳಿಗೆ ಹರದಂಗೆ
ಇಟ್ಟೆಡಗಳಾಸೆ ಸರ್ವಜ್ಞ ೨೭೨

ತ್ರಿಪದಿ॥ ಕಂಡವರತೆಗಳುವನ, ಕಂಡಿಹಳ ಬಿಡದವನ
ಭಂಡನೆರೆಯಾಡಿ ಕಾಲಕೆದುರುವನ,
ಕಂಡಿಹರೆ ತೊಲಗು ಸರ್ವಜ್ಞ ೨೭೩

ತ್ರಿಪದಿ॥ ಹಂಗಿನರಮನೆಯಿಂದ ವಿಂಗಡದಗುಡಿಲೇಸು
ಭಂಗಪಟ್ಟುಂಬ ಬಿಸಿಯನ್ನಕಿಂತಲು
ತಂಗುಳವೆ ಲೇಸು ಸರ್ವಜ್ಞ ೨೭೪

ತ್ರಿಪದಿ॥ ಆಳಾಗ ಬಲ್ಲವನು, ಆಳುವನು ಅರಸಾಗಿ
ಆಳಾಗಿ ಬಾಳಲರಿಯದನು ಕಡೆಯಲ್ಲಿ
ಹಾಳಾಗಿ ಹೋಹ ಸರ್ವಜ್ಞ ೨೭೫

ತ್ರಿಪದಿ॥ ಎಲ್ಲವನು ಅರಿಯುವುದು ಬಲ್ಲವನು ಎನಿಸುವುದು
ನಲ್ಲಳನು ಅರಿತು ಕೂಡುವುದು ಜಗದೊಳಗೆ
ಎಲ್ಲವರಿಗಿಹುದು ಸರ್ವಜ್ಞ ೨೭೬

తే॥ గీ॥ జనని తెగనమ్మి దాసిని గొనిన తెరగు
ముక్తితత్త్వము విడనాడి భుక్తికొరకు
పరుగులిడువాడు హీనుడు ఖరముకన్న
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 271

తే॥ గీ॥ జోళ్ళపై కోర్కె కాళ్ళకు, జోళ్ళు దినగ
ఆశపడునావు, గుహాలు మృగాళికిష్ట
వర్తకుని వాంఛ లాభంపు పరుసలందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 272

తే॥ గీ॥ పరుల నిందించు వానిని, పరుల సతుల
వలచు వానిని, తులువల చెలిమి గలుగు
కలహకారిని, గాంచిన దొలగ వలయు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 273

తే॥ గీ॥ భంగపడి నిల్చు ప్రాసాద వసతి కంటె
పడిన గుడి మేలు. నిందలం గుడుచు వేడి
అన్నమునకంటె చద్దిది తిన్నమేలు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 274

తే॥ గీ॥ కొలుచు పెరిగిన ఏలికైె చెలగ వచ్చు
కొలుచు పెరుగని వాడైన కలత వచ్చు
తుదకు నాశము వచ్చును వెదకి కొనుచు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 275

తే॥ గీ॥ ప్రాజ్ఞుడగుటయు బుధునిగా వాసిగనుట
కన్య మనసెరిగి తగువరు కరము నిడుట
సహజమిది ఎల్లవారికి జగతి యందు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 276

ತ್ರಿಪದಿ|| ಮೆಚ್ಚದಿರು ಪರಸತಿಯ, ರಚ್ಚೆಯೊಳು ಬೆರೆಯದಿರು
ನಿಚ್ಚ ನೆರೆಯೊಳು ಕಾದದಿರು, ಒಬ್ಬರ
ಇಚ್ಛೆಯಲಿರದಿರು ಸರ್ವಜ್ಞ ೨೭೭

ತ್ರಿಪದಿ|| ಮಾನಾಪಮಾನವನು, ಜ್ಞಾನತನಗಾದುದನು
ಮಾನಿನಿಯು ಒಲಿದ ರತಿ ಸುಖವ, ಪರರಲ್ಲಿ
ಮಾನಿಸುವ ನೆಗ್ಗ ಸರ್ವಜ್ಞ ೨೭೮

ತ್ರಿಪದಿ|| ಎಳ್ಳು ಗಾಣಿಗ ಬಲ್ಲ, ಸುಳ್ಳು ಸಿಂಪಿಗ ಬಲ್ಲ
ಕಳ್ಳರನು ಬಲ್ಲ ತಳವಾರ, ಬಣಜಿಗನು
ಎಲ್ಲವನು ಬಲ್ಲ ಸರ್ವಜ್ಞ ೨೭೯

ತ್ರಿಪದಿ|| ನೀರಬೆಬ್ಬುಳಿ ನೆಚ್ಚಿ ಸಾರಿಕೆಡದಿರು ಮರುಳೆ
ಸಾರಗುಣಿಯಾಗು ನಿಜವತಿಳಿ, ಸರುವರೊಳು
ಕಾರಣಿಕನಾಗು ಸರ್ವಜ್ಞ ೨೮೦

ತ್ರಿಪದಿ|| ಗಂಧವನು ಇಟ್ಟು ಮೇಲಂದದಲಿ ಇರಬೇಕು
ನಿಂದೆ ಕುಂದುಗಳ ತಾಳಿಹನು, ಧರಣಿಯಲಿ
ಇಂದುಧರನೆಂದ ಸರ್ವಜ್ಞ ೨೮೧

ತ್ರಿಪದಿ|| ಊರೆಲ್ಲ ನೆಂಟರು, ಕೇರಿಯಲ್ಲವು ಬಳಗ
ಧಾರುಣಿಯು ಎಲ್ಲ ಕುಲದೈವವಾಗಿನ್ನು
ಯಾರನ್ನು ಬಿಡಲೊ ಸರ್ವಜ್ಞ ೨೮೨

తే॥ గీ॥ మెచ్చ కుండుము పరకాంత, రచ్చజేర
జనకు, హితుని సంప్రీతితో గనగజనుము
ఒకరి ఇచ్ఛకు లోబడి యుండవలదు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 277

తే॥ గీ॥ జ్ఞానమబ్బుట, మానావమాన మగుట,
సుదతి సురతాన వలపుల సుఖము నిడుట,
పరుల కెరిగించు వాడెపో పామరుండు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 278

తే॥ గీ॥ తిలల నెరుగును గానుగ ద్రిప్పువాడు,
తలవ రెరుగును చోరుల, దర్జివాడు
నన్నృత మెరుగును, వర్తకుండఖిల మెరుగు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 279

తే॥ గీ॥ మెచ్చకుము నీటి బుడగల పిచ్చివాడ
సారగుణియౌచు జనులందు సత్యమరసి
రహివెలుంగుము జగతి, కారణికుడగుచు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 280

తే॥ గీ॥ గంధము ధరించి జూచుట కందమొలుక
దూషణంబుల సైచుచు దుఃఖపడక
తాల్మిగలవాడె తరుణేందుధరుడు భువిని
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 281

తే॥ గీ॥ ఊరు ఊరెల్ల బంధులై యొప్పుచుండ
వాడ వాడెల్ల నాప్తులై బరగు చుండ
వసుధ కులదైవమైన నెవ్వాని విడుతు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 282

ತ್ರಿಪದಿ॥ ಮೊಸರು ಇಲ್ಲದ ಊಟ, ಕೆಸರು ಇಲ್ಲದ ಗದ್ದೆ
ಬಸುರಾಗದವಳ ಬಾಳುವೆಯು, ಬೇಸಿಗೆಯ
ಬಿಸಿಲು ಕಾದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೮೩

ತ್ರಿಪದಿ॥ ದೇಶವಿಲ್ಲದ ದೊರೆಯು ಕೋಶವಿಲ್ಲದ ಹರದ
ಕೂಸುಳಿಯದವಳ ಬಾಳುವೆಯು, ಬೂದಿಯನು
ಪೂಸಿಕೊಂಡಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೮೪

ತ್ರಿಪದಿ॥ ಮಕ್ಕಳಿಲ್ಲದ ಮನೆಯು, ಹಕ್ಕಿ ಇಲ್ಲದ ವನವು
ದಿಕ್ಕಿಲ್ಲದವನ ಸಂಸಾರ, ಕಳನು ಮನೆ
ಹೊಕ್ಕು ಹೋದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೮೫

ತ್ರಿಪದಿ॥ ರೊಕ್ಕವಿಲ್ಲದ ಬಾಳ್ವೆ, ಮಕ್ಕಳಿಲ್ಲದ ಮನೆಯು,
ಅಕ್ಕರವಿಲ್ಲದ ತವರೂರು, ಇವು ಮೂರು
ಮುಕ್ಕ ತಾಣಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೮೬

ತ್ರಿಪದಿ॥ ಹಸಿವಿಲ್ಲದುಣಬೇಡ, ಹಸಿದು ಮತ್ತಿರಬೇಡ
ಬಿಸಿಗೂಡಿ ತಂಗುಳುಣಬೇಡ, ವೈದ್ಯನ
ಬೆಸಸಲೇಬೇಡ ಸರ್ವಜ್ಞ ೨೮೭

ತ್ರಿಪದಿ॥ ಒಪ್ಪೊತ್ತುಂಡವ ತ್ಯಾಗಿ, ಇಪ್ಪೊತ್ತುಂಡವ ಭೋಗಿ
ಬಪ್ಪೊಗುಂಡವ ನೆರರೋಗಿ, ಯೋಗಿ ತಾ
ಸುಮ್ಮನಿರುತಿಹನು ಸರ್ವಜ್ಞ ೨೮೮

తే॥ గీ॥ పెరుగు లేకున్న సాపాటు, ఉంగరు లేని
వరిపొలమ్ములు, వంధ్యయౌ [illegible] బ్రతుకు
బాధ కలిగించు గ్రీష్మతాపమ్ము పగిది
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 283

తే॥ గీ॥ రాజ్యమే లేని రాజు, నిర్ధనుడు బేరి,
బ్రతుక నోచని పాపల బడయు తల్లి
బ్రతుకులీమూడు బూడిద రాసినట్లు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర 284

తే॥ గీ॥ దిక్కెరుగని సంసారము, పక్కిగములు
లేని వనమును, పాపలు లేని యిల్లు,
చోరుడిలు సొచ్చి వెళ్ళిన తీరు జూవె
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 285

తే॥ గీ॥ రొక్కమును లేని నిరుపేద రోత బ్రతుకు,
అలర పాపలు లేనిల్లు, అక్కరకును
రాని పుట్టిల్లు, దుఃఖకరమ్ము లౌర
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 286

తే॥ గీ॥ ఆకలియు లేక గుడువకు, ఆకలైన
గుడువ తడయకు, మరిచద్ది గూడి వేడి
జేరిపి తినకు వైద్యుని చేర జనకు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 287

తే॥ గీ॥ [illegible] [illegible] కొకసారి ఆరగించు
భోగి యిరుమారు భుజియించు రోగి [illegible]
నుబ్బ[illegible], యోగితా [illegible]
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 288

ತ್ರಿಪದಿ|| ಕಚ್ಚೆ ಕೈ ಬಾಯಿಗಳು ಇಚ್ಛೆಯಲಿ ಇದ್ದಿಹರೆ
ಅಚ್ಯುತನಪ್ಪ ಅಜನಪ್ಪ ಲೋಕದಲಿ
ನಿಶ್ಚಿಂತನಪ್ಪ ಸರ್ವಜ್ಞ ೨೮೯

ತ್ರಿಪದಿ|| ಬಸವನೆಂದರೆ ಪಾಪದೆಸೆಗೆಟ್ಟು ಹೋಗುವುದು
ಬಿಸಿಲಿಂಗೆ ಹಸುರೊಳೆಸೆದಿರ್ಪ ಹನಿಯಾರಿ
ಹುಸಿದು ಹೋದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೯೦

ತ್ರಿಪದಿ|| ಕೋಳಿ ಕೂಗದ ಮುನ್ನ ಏಳುವದು ನಿತ್ಯದಲಿ
ಭಾಳಲೋಚನನ ಭಕ್ತಿಯಿಂ ನೆನೆದರೆ
ಆಳಿನಾಳಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೨೯೧

ತ್ರಿಪದಿ|| ಒಳ್ಳೆಯನು ಇರದೂರು, ಕಳ್ಳನೊಡನಾಟವು
ಸುಳ್ಳನಮಾತು, ಇವು ಮೂರು ಕೆಸರೊಳಗೆ
ಮುಳ್ಳುತುಳಿದಂತೆ ಸರ್ವಜ್ಞ ೨೯೨

ತ್ರಿಪದಿ|| ತಂದೆತಾಯಿಗಳ ಮನದಿಂದ ವಂದಿಸುವಂಗೆ
ಬಂದ ಕುತ್ತುಗಳು ಬಯಲಾಗಿ, ಸ್ವರ್ಗವದು
ಮುಂದೆ ಬಂದಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೨೯೩

ತ್ರಿಪದಿ|| ಹೇಡಿಗೆ ಹಿರಿತನವು ಮೂಢಂಗೆ ಗುರುತನವು
ನಾಡ ಮೂರ್ಖಂಗೆ ದೊರೆತನವು ದೊರೆತಿಹರೆ

చ్చుడము,నోరు,కరమును ఇచ్ఛనున్న
చ్యుతుండగు నజుడగు నప్రమేయ
శ్వతానంద భరితుడౌ జగతియందు
పది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 289

సవయన్నంత పాపముల్ బ్రద్దలగును
దయ కిరణాల లేయెండయూప్పు సోక
వురు జొంపాల తుంపురుల్ ఇవురునట్లు
పది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 290

డికూతకు ముందుగా కూర్మిలేచి
క్తి శివునాత్మ భజియించు వారికెపుడు
వుడు రక్షించు వారింట బంటుఅగుచు
పది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 291

గుణి యుండని గ్రామము, చోరు చెలిమి,
నృతుని పలుకు, ఇవి మూడు అడుసునందు
న్న ములుకంప ద్రొక్కిన తెన్నునగును
పది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 292

నని జనకుల సేవలం దనుపు వాని
రమ్మ నాపద దూరమై గలగి తొలగు
లరు స్వర్గంబు కరతలామలకమగును
పది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 293

మూర్ఖుడు దొరయైన, గురువు మూఢుడైన,
రికి పందయు సంఘాన పెద్దయైన,
జ్యరమ అస్థిరంబగు రక్తి లేక

# ಒಗಟುಗಳು

ತ್ರಿಪದಿ॥ ಕಚ್ಚಿದರೆ ಕಚ್ಚುವುದು ಕಿಚ್ಚಲ್ಲ ಚೇಳಲ್ಲ
ಅಚ್ಚರಿಯಿದಲ್ಲ ಅರಿದಲ್ಲ ಈ ಮಾತು
ನಿಶ್ಚಯವಿದೆಂದ ಸರ್ವಜ್ಞ (ಮೆಣಸಿನಕಾಯಿ) ೨೯೫

ತ್ರಿಪದಿ॥ ಕಡೆಬಿಳುದು ನಡುಗಪ್ಪು ಉಡುವವಸ್ತ್ರವದಲ್ಲ
ಬಿಡದೆ ನೀರುಂಟು ಮಡುವಲ್ಲ, ಕವಿಗಳೇ
ಬೆಡಗ ಪೇಳುವುದು ಸರ್ವಜ್ಞ (ಕಣ್ಣು) ೨೯೬

ತ್ರಿಪದಿ॥ ಕಾಲಿಲ್ಲ ಕೊಂಬುಂಟು ಬಾಲದ ಪಕ್ಷಿಯದು
ಮೇಲೆ ಹಾರುವುದು ಹದ್ದಲ್ಲ ಕವಿಗಳೇ
ಆಲಿಸಿದು ಹೇಳಿ ಸರ್ವಜ್ಞ (ಗಾಳಿಪಟ) ೨೯೭

ತ್ರಿಪದಿ॥ ಮಂಡೆಬಾಯೊಳಗಿಕ್ಕು ಚಂಡಿಕೆಯ ಹೊರಗಿಕ್ಕು
ಹೆಂಡತಿಯು ನಡೆಯು ಬರುತಿಕ್ಕು ಕಡೆಗೊಂದು
ಉಂಡೆಯಂತಿಕ್ಕು ಸರ್ವಜ್ಞ (ಕಡೆಗೋಲು) ೨೯೮

ತ್ರಿಪದಿ॥ ಹಲ್ಲುಂಟು ಮೃಗವಲ್ಲ ಸೊಲ್ಲು ಸೋಜಿಗವಲ್ಲ
ಕೊಲ್ಲುವಾಗ ನನ್ನ ನಂಬಿದರ, ಆದರಿಂದ
ಬಲ್ಲವರು ಹೇಳಿ ಸರ್ವಜ್ಞ (ಗರಗಸ) ೨೯೯

ತ್ರಿಪದಿ॥ [illegible] ಬೆಳೆದಿಹುದು
[illegible] ಹಸುರೆ ನೆಲವಾಗೆ ತಾನಾಗಿ
[illegible] ಹೋಗುವುದು ಸರ್ವಜ್ಞ (ಬಾಳೆ) ೩೦೦

# పొడుపు కథలు

తే॥ గీ॥ కరచినంతట వెనువెంట గరచు నదియు,
కాదు చిచ్చది, మరి వృశ్చికంబుగాదు
వింతకాదిది ఒడుపుతో విడుపు గనుడు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. (మిరపకాయ) 295

తే॥ గీ॥ నిండు తెలుపుండు నడుమన నుండు నలుపు,
పలువయా కాదు, జలముండు కొలనుకాదు,
నిజ్ఞులగునార లీముడి విప్పవలయు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. (కన్ను) 296

తే॥ గీ॥ కొమ్ము తోకయుగల పక్షి నమ్మగాదు
పాదములు లేవు గగనాన పరుగు దీయు
గ్రద్దయా కాదు ఎరుగు డీ కథకు విడుపు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. (గాలిపటము) 297

తే॥ గీ॥ నోట తలబెట్టి కొప్పును బైట బెట్టి
వనిత నడుమాడ మథియింప వచ్చు నుండ
దీని భావము కోవిదుల్ దెలుపవలయు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర (కవ్వము) 298

తే॥ గీ॥ [illegible]డును [illegible]వడి క్రూర మృగము
[illegible] వారిని తానె [illegible]ంపు
ప్రాజ్ఞు లెరిగిన బావమ్ము [illegible]
త్రిపది [illegible] దేశికేంద్ర [illegible] 299

[illegible] తీనమ్ము [illegible]ను సుళులు [illegible]
[illegible] సంతా[illegible] [illegible]
దీని బావమ్ము తెల్పుడు [illegible]
త్రిపది కవిచం[illegible] [illegible] 300

ತ್ರಿಪದಿ॥ ನೆತ್ತಿಯಲಿ ಉಂಬುವುದು, ಸುತ್ತಲು ಸುರಿಸುವುದು
ಎತ್ತಿದರೆ ಎರಡು ಹೋಳಹುದು, ಕವಿಗಳಿದ-
-ಕುತ್ತರವ ಹೇಳಿ ಸರ್ವಜ್ಞ (ಹಿಟ್ಟು, ಬೀಸುವಕಲ್ಲು) ೩೦೧

ತ್ರಿಪದಿ॥ ಇರಿದರೆಯು ಏರಿಲ್ಲ ಹರಿದರೆಯು ಸೀಳಿಲ್ಲ
ತಿರಿಗೂಳಕೊಂಡು ಋಣವಿಲ್ಲ, ಕವಿಗಳಲಿ
ಅರಿದರಿದಹೇಳಿ ಸರ್ವಜ್ಞ (ಬೆಂಕಿ) ೩೦೨

## ಶಕುನಗಳು

ತ್ರಿಪದಿ॥ ಇರಿದೊಮ್ಮೆನಡೆಯುತ್ತ ಸರಕನೇ ಸೀತಿಹರೆ
ಅರಿದರಡಿಯಿಡದೆ ನಿಲ್ಲುವದು, ಮರೆದಿಹರೆ
ಇರಿದುಕೊಂಡಂತೆ ಸರ್ವಜ್ಞ ೩೦೩

ತ್ರಿಪದಿ॥ ಏನುಮನ್ನಿಸದಿರಲು ಸೀನು ಮನ್ನಿಸಬೇಕು
ಸೀನು ಮನ್ನಿಸದೆ ಹೋಗಿಹರೆ, ಹೋದಲ್ಲಿ
ಹಾನಿಯೇ ಬಕ್ಕು ಸರ್ವಜ್ಞ ೩೦೪

ತ್ರಿಪದಿ॥ ನಿನ್ನವೇ ತ್ರಿಪದಿಗಳು ನನ್ನದೀ ಅನುವಾದ
ನಿನ್ನಗರ್ಪಿತವೆಂದೆ ಮಂಗಳವೀ ಜಗಕೆ
ಎನ್ನು ಎನ್ನಯ್ಯ ಸರ್ವಜ್ಞ ೩೦೫

ಸರ್ವಜ್ಞ ತ್ರಿಶತಿ ಸಂಪೂರ್ಣ

ಶಾಂತಿಃ ಶಾಂತಿಃ ಶಾಂತಿಃ



॥ గీ॥ శిరము వాయిగ భుజియించు, తిరుగు ద్రిప్పి
జార్చు దన చుట్టు, ఎత్తిన జంట వీడు
కవులు భావంబు దెలుపుడు చవులు మీర
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. (తిరుగలి) 301

॥ గీ॥ చెండగా రాదు, చించిన రెండు గాదు
కడకు నచ్చుట మిగులేది కానరాదు
విషయ మరయుడు పొడుపున మిషయదేమి
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. (అగ్ని) 302

# శకునములు

॥ గీ॥ త్రోవనడచుచు ఒకతుమ్ము తుమ్మినంత
నవల ముందుకు సాగుట నాపవలయు
అదిమరచి పోవ నశుభ మౌనండ్రు బుధులు
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 303

॥ గీ॥ ఇతర శకునము లెన్నైన నెన్నవలదు
తుమ్ము శకునమ్ము మాత్రము నమ్మవలయు
నమ్మ కుండిన నాపద గ్రమ్ముకొనును
త్రిపది కవిచంద్ర సర్వజ్ఞ దేశికేంద్ర. 304

అంకితము

॥ గీ॥ సరస త్రిపదులు సర్వజ్ఞు విరచితములు
దెనుగెనర్చితి సర్వజ్ఞ త్రిశతి యనగ
కావ్య మర్పింతు సర్వజ్ఞకవి వరునకు
అఖిల జగతికి మంగళంబగునుగాత 305

సర్వజ్ఞ త్రిశతి సంపూర్ణము